
ఆ జలుబును
వెంటనే
పోగొట్టుకోండి




AMRUTANJAN
Pain Balm
AMRUTANJAN
PAIN BALM
AMRUTANJAN LTD

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 11—11—'66
పరాభవనామ సం॥ ఆశ్వయుజమాసం॥ బ॥ షష్ఠి
సంపుటము : 59 సంచిక : 9

*

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

చందా వివరాలు :

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్ధ సంవత్సర చందా | 16.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన: శ్రీ బాపూ



# మనలో మాట

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరికీ దీపావళి ప్రకాశవంతంగా ఉండాలని కోరుకుంటున్నాము

* * *

ఈ సంవత్సరం దీపావళి కథలపోటీకి కొన్ని వేలకథలు వచ్చాయి. రచయిత(త్రు)ల ఉత్సాహం మాకు చాలా ఆనందం కలిగించిందికాని ఈ పరిస్థితులలో ప్రచురణకి స్వీకరింపబడని కథలు రాసినవారికి ఒక్కొక్కరికీ ఆ సంగతి తెలియచేస్తూ కార్డులు పంపటం వీలుకాదుకాబట్టి, పోటీలో నెగ్గకపోయినా దీపావళిసంచిక తర్వాతి సంచికలలో పడబోయే కథల వివరాలకి సంబంధించిన ప్రకటన ఇదే సంచికలో మరోకచోట వేశాము. ఆ ప్రకటనలోలేని కథలు ప్రచురణకి స్వీకరించబడలేదని పోటీలో పాల్గొన్నవారందరూ గమనించ ప్రార్థన. ఈ విషయమయి ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపటానికి వీలులేదన్న పోటీ నిబంధన మరోసారి అందులో పాల్గొన్నవారికి గుర్తు చేస్తున్నాము.

పోటీలో పాల్గొన్న రచయితలకీ, రచయిత్రులకీ మా కృతజ్ఞతలు!

మొదటి బహుమతిపొందిన శ్రీమతి గుళ్లపల్లి సుందరమ్మగారు ఇరవయి ఏళ్లుగా మద్రాసులోనే ఉంటున్నారు. విజయనగరంలో జన్మించినవీరికి ఇద్దరు అబ్బాయిలు, ఇద్దరు అమ్మాయిలు. భర్త మద్రాసులో చార్టర్డ్ ఎకవుంటెంట్‌గా పని చేస్తున్నారు. శ్రీమతి సుందరమ్మగారికి చిన్నప్పటినుంచీ రచనలంటే ఇష్టం. అరవం బాగా వచ్చు. అందులో కథలు రాశారు. ఆంధ్ర మహిళాసభలో జీవితాంత సభ్యురాలయిన ఈమె 'రచనలు నిత్య జీవితానికి ఉపయోగించేవిగాను, జనాన్ని మంచి త్రోవలో నడిపించేవిగాను ఉండాలి' అంటారు. రేడియోద్వారా 'ఇల్లాలు', నాటకం, 'సుడిగాలి', 'బృందావనం' నవలల్ని శ్రోతలకి వినిపించారు.

శ్రీ మల్లాది సూరిబాబుగారు "కీ. శే. మల్లాది రామకృష్ణశాస్త్రిగారి రెండవ కుమారులు. వీరు 'ఆంధ్రా సయింటిఫిక్' కంపెనీ పరిశోధనశాఖలో శాస్త్రజ్ఞులు. భారతదేశం అంతటా, కొన్ని విదేశాలూ పర్యటించారు. ఇంగ్లీషు, సంస్కృతం, హిందీ, తెలుగు, అరవం, బెంగాలీ భాషలతో పరిచయం వుంది. స్థానిక లయన్స్ క్లబ్ ఉపాధ్యక్షులు. ఫొటోగ్రఫీ, నాటకాలంటే ఇష్టం. తెలుగుపత్రికా ప్రపంచానికి వీరు సుపరిచితులు........

'రాధకథా, రామకథా' రచయిత శ్రీ వాకాటి పాండురంగారావుగారు పుట్టినదీ, చదువుకున్నదీ మద్రాసులోనే. (లయోలా కాలేజి). కర్నూలు, హైదరాబాదుల తర్వాత, 1963 నుంచీ ఢిల్లీలోని ఆహార, వ్యవసాయ శాఖలో పనిచేస్తున్నారు. 1951లో కీ. శే. న్యాయపతి నారాయణమూర్తిగారి ప్రోత్సాహంతో కథలురాయటం మొదలుపెట్టారు. ఇప్పటికి 125 దాకా అచ్చులయి ఉంటాయి........

* * *

ఈ దీపావళి ప్రత్యేకసంచికలో చలనచిత్ర పరిశ్రమతో ప్రముఖులయిన ముగ్గురికి సంబంధించిన వ్యాసాలు వేస్తున్నాము.........

* * *

లండన్‌లో ఆధునిక భారతీయ చిత్రకళకి మంచిపేరు తెస్తున్న శ్రీ ఎస్. వి. రామారావుగారు ఆఫ్రికా ఖండం కళాసంపదని తెలుగు పాఠకులకి పరిచయంచేస్తూ రాసిపంపిన వ్యాసం, బొమ్మలు ఈ సంచికలో మరోక ఆకర్షణ........

* * *

ఇక టపాకాయలతయారీ, దీపావళిపండగ ప్రత్యేకత మొదలయినవాటిని గురించిన వ్యాసాలు, కార్టూన్లు కాక ఈవారం ఆంధ్ర సచిత్రవారపత్రికలో చైనా ఎర్ర రక్షకుల విధ్వంసక్రియలని కళ్లార చూచివచ్చిన బ్రిటిష్ పత్రికా విలేఖరి గ్లోరియామ్సువార్ట్ వ్యాసల శీర్షిక ప్రారంభిస్తున్నాము.......

* * *

ముఖచిత్రం, మొదటి, రెండవ బహుమతులు పొందిన కథలకు, శ్రీమతి భానుమతీరామకృష్ణ రచనకీ బొమ్మలు శ్రీ బాపూ వేశారు.

* * *

స్థలాభావంచేత ఈవారం వైజ్ఞానికగాథావళి, బాలసాహితి, చిత్రంపాతి, ఉత్తరాలు శీర్షికల ప్రచురణ సాధ్యంకాలేదు.



శ్రీమతి సుందరమ్మ



శ్రీ సూరిబాబు



శ్రీ పాండురంగరావ్



హో..., పెరుగుతున్న నా అణుదంతాల్తో ఎప్పుడో ఈ ప్రపంచాన్ని నమిలి మింగేస్తాను!
భలే, మన ఆశయాలన్నీ ఒకటే!
అధినాయక సమావేశం రిపోర్టు
అణు దంతాలు
చైనా
సుబాండ్రియోకు ఉరితాడు!
సుకర్నో
నా అదృష్టం ఎలా వుందో?
వామపక్షంలో చీలికలు!
వామపక్ష కమ్యూనిస్టులు
పశ్చిమ బెంగాలులో వామపక్షానికి మద్దతు

శ్రీకృష్ణ

# అధినాయక సమావేశము - అభ్యుదయ సాధన

## ఊటికెక్కలేనమ్మ స్వర్గానికెక్కింది!

ఈమధ్య 'ముమ్మూర్తి' సమావేశం, దసరా పండుగ, రంగాన్ని అలంకరించి వున్నాయి. విద్యార్థుల అల్లర్లు, గోవధ నిషేధం కోసం ఆందోళనలూ ఇంకా అలానే రంగులీనుతున్నాయి.

నెహ్రూ మ్యూజియం బయట "త్రిమూర్తి" విగ్రహం ఒకటి వుంది. హిందూ మతానికి అవతార పురుషులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఈ 'త్రయం.' క్రైస్తవ మతానికి ఆధారభూతమైంది ఈ 'త్రయమే.' ఇటీవల ఢిల్లీలో సమావేశమూ ముమ్మూర్తులతోనే జరిగింది. భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ, యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో, యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ నాజర్ ఈ ముమ్మూర్తులు.

విక్టోరియారాణి గారి విదేశాంగమంత్రి శ్రీ పామర్స్టన్. ఆయన యూరపులోని ఒక చక్రవర్తికి ఉత్తరం రాశారు. "నువ్వు ఉత్తరాన్ని రాశావా?" అని రాణీ గారతన్ని అడిగారు. "రాశానండి రాణీగారూ" అన్నాడతను. "ఆ చక్రవర్తి బ్రిటన్‌కి గొప్ప మిత్రుడని నీకు తెలుసునా?" అని అడిగారు రాణిగారు. అప్పుడు పామర్స్టన్ సమాధానం చెప్పాడూ, "బ్రిటన్‌కు ఎవరితోనూ స్నేహమూలేదు, శత్రుత్వమూ లేదు. బ్రిటన్ కున్నదల్లా ఒక్క స్వార్థమే!" అని.

ఇది దౌత్య వ్యవహారాల్లోని చతురతకు నిదర్శనం. హిందూదేశం యొక్క రాజనీతి, ముఖ్యంగా విదేశ రాజ్యాంగ పద్ధతికి ముడి పెడుతూ దేశం తన స్వంత ప్రయోజనాల్ని ఏమైనా సాధించుకోగల్గుతుందా అనే ప్రశ్న తరచు వేయబడుతూనే వుంది.

మాస్కోలో విడుదలైన సమిష్టి ప్రకటన ద్వారా మనకు తెల్లమైంది ఏమిటి అంటే, కనీసం ఇరవై అయిదు మిలియన్ డాలర్ల సహాయమన్నా కొరతబడుతుందీ అని. ఆ సమిష్టి ప్రకటనలో ప్రధాన మంత్రి 'రెండు జర్మనీ'లున్నాయని గుర్తించాలి అని చెప్పారు. ఇటీవల మార్షల్ టిటోగారు కూడా అదే సూచించారు. ఇండియాకు అధికృత నిచ్చేముందు 'రెండు కాశ్మీర్' లున్నాయని ఇతరులంటున్న మాటలను గూడా గుర్తించాల్సిందే అని జర్మను లంటున్నారు.

ఇదీ వ్యవహారం. ఈ అధినాయక సమావేశం ద్వారా హిందుదేశానికేం లాభం కలిగిందో చూడాలి. ఈ సమావేశం, ఆసియా— ఆఫ్రికాదేశాల ఐకమత్యానికి, కృషి చేసిందా అంటే, మార్షల్ టిటో గార్ని ప్రక్కగా వుంచాల్సి వస్తుంది. నిబంధ దేశాలకు సంబంధించిన సమావేశమా? పోనీ, పాశ్చాత్య వ్యతిరేక దేశాల్లాగున అమెరికాను ఆసియాలోంచి వెలివేయాలనే వాదాన్ని ఈ సభ ఏమైనా బలపరచడానికి ఉద్దేశింపబడిందా? అదీకాదు. అమెరికాను యూరప్‌లోనే తన పలుకుబడిని ఎక్కువ ఉపయోగించుకోమన్న చైనా మాటలే మళ్లీ చెప్పబడ్డాయి. సహాయం గురించి వాదించబడింది. తమదేశం వలె భారతదేశం కూడా సహాయాన్ని ఎందుకు కోరకుండా వుండలేకపోతోంది? అని ప్రెసిడెంట్ నాజర్ ప్రశ్నించారు. "ఈజిప్టే అలా చేయగలిగితే మీరెందుకు చేయలేరు?" అని ఆయన అన్నారు. సత్వర సమాధానం ఏమిటీ అంటే భారతదేశం ఈజిప్టు కాలేదు. ఈజిప్టులో నాజర్‌గారు మణిపూసలాంటి మనిషి. మన దేశంలో అలాకాదు. మన కేంద్రమంత్రులు వారివారి నీడల్ని చూసుకునే భయపడి పోతున్నారు.

గోవధ నిషేధానికిగాను ఒక డజనుమంది సాధువులు తీవ్రమైన ఆందోళన సాగిస్తున్నారు. ఘనత వహించిన దేశీయాంగ మంత్రిగారు కొన్ని సవరణలను సూచించారు. కాంగ్రెసుకు దేశమంతా పాలించాలనే కాంక్షతోపాటు కార్యాలయాల్లో వల్లోంచి పని చేయాలని కూడా వుండాలి. అతి చిన్న విషయాల్లోనే మనం తప్పటడుగు వేస్తూ వుంటాం. అందుకే మనం ఈజిప్టును అనుసరించలేము.

విసుక్కుంటూ సహాయం చేస్తున్న పాశ్చాత్యదేశాలకి, భవిష్యత్తులో మేము మీ సహాయం కోరబోవడంలేదు అని భారత దేశం చెప్పలేదు. నాల్గవ ప్రణాళిక రు. 4000 కోట్లు విదేశీ సహాయం మీద, రు. 300 కోట్లు విదేశీ పెట్టుబడి మీద ఆధారపడి వున్నది. విసుక్కుంటూనో, సణుక్కుంటూనో ఏదోవిధంగా విదేశీ సహాయం అనుకున్న మేరకు పుష్కలంగా లభిస్తుందిలే అని భారతదేశం ఆశిస్తున్నట్టయితే అది విచారకరమైన విషయం.

పూర్వం, ఇతరదేశాల్ని దోచుకున్న కారణంగానే ఇప్పటి పాశ్చాత్యదేశాలు సిరిసంపదలతో తులదూగుతున్నాయని, తక్కిన దేశాలు మాత్రం బీద దేశాలుగా మిగిలి పోయాయనీ, అంచేత సంపన్నదేశాలు అభివృద్ధి లేని దేశాలకు సహాయం చేయవలసి వుందని అంటున్నారు. అమెరికా, జర్మనీ దేశాలకు చెందిన వలస రాజ్యాలు లేవుగనక, అవి స్వతంత్ర రాజ్యాలు గనక సహాయం చేయవలసిన బాధ్యత లేదన్నమాటే! అలానే స్వీడన్, స్విడ్జర్లాండు, డెన్మార్కు, నార్వే, ఆసియా దేశాలని కూడా సహాయం అడక్కూడదు. సామెత చెప్పినట్టుగా, 'డాక్టరుగారూ నన్ను ముందు బాగుచెయ్యండి' అనే పరిస్థితిలో వున్నప్పుడు, భారతదేశంలోని ఇరవై 'సంపన్న కుటుంబాలి'నీ ఏంచేయాలి? వీళ్లందరూ విదేశంలో వున్న 'మారక ద్రవ్యాన్నంతా భారతదేశానికి తీసుకురావడానికి సిద్ధంగా వున్నారా?

ముఖ్యమైన ప్రశ్న ఏమిటీ అంటె, ఈ అధినాయక సమావేశం ద్వారా మనకు లభించింది ఏమిటి? కాశ్మీరు ప్రసక్తిగాని, పాకిస్తాన్ విషయంగాని ఈ సమావేశంలో తీసుకురాబడిందా? చైనా మళ్ళీ మనపై దాడి జరిపినప్పుడు ఈ ఇద్దరు మహానాయకులు మనకు తగిన సహాయం చేస్తామని వాగ్దానం చేశారా? ఈ సమావేశం ప్రపంచ శాంతికి కృషి చేసింది! ముఖ్యంగా వియత్నాంలో శాంతిభద్రతల గురించి చర్చించింది! హాబీగా పెట్టుకుని 'బంద్'లు జరపడం, బస్సుల్నీ, ట్రాముల్నీ, రైలు పెట్టెల్నీ తగలబెట్టడం, అద్దాల కిటికీలను పగలగొట్టడం, ప్రజల్ని హింసించడంలాంటి దుష్కృత్యాలని శాంతపరచడానికి ఇది ఉద్దేశింపబడితే సమంజసంగా వుండేది!

ప్రపంచశాంతిని అర్థించే ముందు, ఈ దేశంలో శాంతిభద్రతల్ని కాపాడండి అని అడగడానికి ప్రజలకు హక్కుంది. ఏ ప్రభుత్వమైనా ఈ ప్రశ్నకు సమాధానం చెప్పవలసి వుంటుంది. వియత్నాంలో శాంతిని నెలకొల్పేందుకు తగిన మిలిటరీ, ఆర్థిక, పారిశ్రామిక స్వామత ఏమన్నా మన దేశంలో ఎక్కువగా వుందా ఏం? ఈ 'ముమ్మూర్తుల తమాషా'లో భారతదేశం నవ్వులపాలయింది!

ప్రధానమంత్రి తమ ఉపన్యాసారంభంలో, 'లేని' దేశాలకి సహాయం చేయడానికి ముందుకు రాలేకపోతున్న 'ఉన్న' పాశ్చాత్యదేశాల్ని తూలనాడారు. గోవధ నిషేధానికి సాధువులు చేస్తున్న ఆందోళనను బ్రిటిష్‌వారు ప్రోత్సహిస్తున్నారు! ఢిల్లీలో ఇద్దరు బ్రాహ్మణ బాలురిని దసరారోజున పూజించమని అమెరికా ప్రభుత్వం నిర్బంధించింది! ఎంత చక్కని సామ్యం!

ఢిల్లీలో మరో అద్భుతమేమిటి అంటే, సాధువులు కూడా మూడోతరగతికి చెందిన పాశ్చాత్యుల లాగా ప్రవర్తిస్తూ, పాశ్చాత్య వ్యతిరేకమైన బృందగానాలు చేస్తున్నారు! శరీరంలోని వంపులు కనిపించేలా తెల్లని పంచెలు కట్టే మనుషులు ఇక్కడ కనిపిస్తారు. కాని వాళ్లందరికీ పాశ్చాత్యుల నడవడిక కావాలి. పాశ్చాత్యుల గృహోపకరణాలు కావాలి. వాళ్లు నివసించడానికి ప్రతిదీ పాశ్చాత్య పద్ధతిలోనే వుండాలి. మాస్కోలోని రష్యనులు ప్రాక్ దేశస్థులైనట్టుగానే పాశ్చాత్య వ్యతిరేకత 'ఫేషన్' అయిపోయింది! అవును.

## కాగితం ధర పెరిగే సూచన!

కాగితం మీద కంట్రోళ్లు తొలగించడానికి పరీక్ష జరుగుతూ వుంది. కాగితం ధర పెంచడానికి కూడా ప్రభుత్వం ఆలోచిస్తూ వుంది. కాగితం ధర పెంచే నిమిత్తమై పారిశ్రామికమైన వత్తిడి ఎక్కువగా వున్నట్టు తోస్తూ వుంది. అదేవిధంగా పరిశ్రమకు పాత సంస్థలు, కొత్తసంస్థలు యోగ్యమైన— అయోగ్యమైన సంస్థలు ఒక సమస్య! సమానాంతరమైన ధర పెంపుదల కొన్ని సంస్థలకు మంచి లాభాలు చూపెడతాయి. దీనివల్ల పనిలోనూ పరిపాలనలోనూ కుంటువడిన సంస్థలకు కూడా

# న్యూఢిల్లీ లేఖ

కొంత ముడుతుంది! కంట్రోళ్లను ఎత్తివేయడం వల్ల పోటీ పెరిగి అవి అందిచ్చే అధికోత్పత్తివల్ల ధరలు వాటికవే సర్దుకుపోతాయని నచ్చచెబుతున్నారు.

నూలుబట్టలు, చక్కెర పరిశ్రమలకూ ఇటువంటి పరిస్థితే ఎదురవుతూ వుంది. ఈ మొదటి పరిశ్రమ వాణిజ్య మంత్రిత్వ శాఖ పరిపాలనలో వుంది. రెండవది ఆహార వ్యవసాయశాఖ అధీనంలో వుంది.

ప్రభుత్వం అక్టోబరు నెలారంభంలో బట్టల ధరను ఆరు శాతం పెంచేసింది. ప్రత్తి, రంగులు, రసాయనాలు లాంటి ముడిసరుకులు ధర పెరిగిన కారణంచేత ఈ పెంపుదలను చేయవలసి వచ్చిందని కారణం చెప్పబడింది. వేతనాలు పెరగడం వల్ల బొగ్గు ధర పెరిగింది. ఈ రెండు విషయాల్లోనూ ప్రాతకొత్తల 'సంస్థల' యోగ్యాయోగ్యమైన పరిపాలన కొట్టొచ్చినట్టు కనబడుతూ వుంది. ప్రత్తి పరిశ్రమలో వలె కాగితం పరిశ్రమలోనూ ముడిసరుకు ధర పెరిగిపోయింది గనక మేమూ ఈ హెచ్చింపును వాంఛిస్తున్నామని కాగితం పరిశ్రమల వాళ్లంటున్నారు.

ప్రభుత్వం ఒక స్థిర నిర్ణయానికి వచ్చే ముందు పారిశ్రామికులతో చర్చిస్తుంది.

## అభివృద్ధి లేని బట్టల పరిశ్రమ!

భారతదేశంలో బట్టలమిల్లుల పరిశ్రమ ఒక గడ్డు సమస్యగా వుంది. పోటీని ఎదుర్కొనేందుకు జనపనార పరిశ్రమ వలె ఈ పరిశ్రమను నవీనపరచలేదు. 'ఆటోమేటిక్ లూమ్స్'కి వ్యతిరేకత, బట్టల మిల్లుల బాధ్యత మీద ఖద్దరుకు 'సబ్సిడీ'ని ఎక్కువ చేయడం లాంటివి ఈ పరిశ్రమకు అభివృద్ధి నిరోధకాలుగా వున్నాయి. ఉత్పత్తి కయ్యే ఖర్చు అధికమైపోతూ వుంది.

ఈ సంవత్సరం ఆశించతగ్గ అభివృద్ధి కనిపించదు. దసరా, దీపావళి పండగల అమ్మకాన్ని బట్టి చూస్తే వినియోగదార్లు తగ్గిపోయారనిపిస్తూ వుంది. ధర పెంచడం చేత గుడ్డలన్నీ అలానే వుండిపోయాయి. కనీసం మూడు శాతం పెంచినా ఇలానే వుండేది. ముడిప్రత్తి అభివృద్ధయినా అంత మెరుగ్గా కనిపించడంలేదు.

'ప్రజా ప్రభుత్వంలో ఏదీ ఉచ్ఛస్థితికి రాలేదు' అన్న నెహ్రూగారి సూక్తికి నిదర్శనంగా బట్టల పరిశ్రమ అసంతృప్తి ఫలితాలనిస్తూ వుంది. ఎగుమతులకు సంబంధించిన అవకాశాలని మెరుగు పరచడానికి మన వాణిజ్యమంత్రి మనూభాయ్‌షా గారు ఎప్పుడూ విముఖత చూపిస్తూనే వున్నారనేది పరిశ్రమకు అర్థమైపోయింది. ఎగుమతికి సంబంధించిన మేలైన పథకాలు లేకపోవడమే దీనికి కారణం. గుడ్డలు బేళ్లకు బేళ్లు లాట్లు పడుతున్నాయంటే పడవూ మరి?

## ఆహారధాన్యాల పరిస్థితి

మరో విధంగా చూసినట్టయితే, పూర్వం వున్న చాలీచాలని పరిస్థితులు ఇప్పుడు లేవు. వస్తువులు, బట్టలు కొన్నిప్రదేశాల్లో ఆహారధాన్యాలు, పంచదార, సిమెంటు ఇప్పుడు మార్కెట్లులో తేలికగా లభిస్తున్నాయి. అయితే అవి సక్రమమైన పద్ధతిలో వినియోగదారులకు అందుతున్నాయా అనేది ప్రశ్న.

కొన్ని రాష్ట్రాలలో మినహా తక్కిన ప్రదేశాల్లో ఆహారధాన్యాల కొరత తీరలేదు. బీహారు, తూ. ఉ. ప్రదేశ్ రాష్ట్రాలు సక్రమమైన పరిపాలనలేని రాష్ట్రాలుగా గుర్తింపబడ్డాయి. 1967 లో ఆహారధాన్యాల దిగుమతి కుంటుపడుతుందనేది కూడా మనం మనసులో వుంచుకోవాలి. మన ప్రభుత్వం, రఫీకిద్వాయ్ గారి నుంచయినా ఈ ఆహార సమస్య గురించి ఏమీ నేర్చుకోలేకపోయింది! ఆహార సంబంధమైన క్లిష్ట పరిస్థితిని ఎదుర్కోడానికి కంట్రోళ్ల నెత్తివేస్తానని ఆయన అన్నప్పుడు ఎవరూ ఒప్పుకోలేదు. అయినా, నిర్మాణాత్మకమైన పథకం వేసుకుని ఆపని చేసి ఆయన కృతకృత్యులైనారు. పంచదారను కూడా దిగుమతి చేసి పంచదార పరిశ్రమను హెచ్చరించి జాగ్రత్తపడేలా చేశారు.

దేశవ్యాప్తంగా సకాల వర్షాలు కురిసినప్పుడు, పంటలు బాగా పండినప్పుడే ఈ ఆహారసమస్యపూర్తిగా సమసిపోతుందని మన వారంటున్నారు మరి! ●





# Nital

**MEDICATED PIMPLE CREAM**

(నిటాల్ మొటిమల మందు)

రూ. 1.90 మాత్రమే పన్నులు వేరు

## 7 రోజులు వాడితేనే చాలు

క్రిమిసంహారక పదార్థాలతో తయారుచేయబడిన నిటాల్‌ను డాక్టర్లు సిఫారసు చేస్తారు. చర్మానికి హాయిని చేకూర్చి, శుభ్రపరుస్తుంది.

★ చక్కని సువాసన.

నిటాల్ మొటిమల మందు సురక్షితంగా, హాయిగా, పూర్తిగా మొటిమలను తొలగిస్తుంది. చర్మంలోనికి పోయి, ముమ్మందు తిరిగి మొటిమలను లేవకుండా చేస్తుంది. లోపలికంతా పోవడంచేత మొదలంటా మొటిమలను తీసివేస్తుంది. మొటిమలు ఎండి పడిపోగలవు. దీన్ని వాడిన తర్వాత ఇతర దోషాలేమీ వుండవు. మచ్చలుగాని, గుంటలుగాని పడవు.

యువతీ యువకులందరూ వాడవచ్చు. చర్మాన్ని శుభ్రపరచి, మనుపు తేల్చి నిగనిగలాడుతూ యౌవ్వనం ఉట్టిపడేటట్లు చేస్తుంది.

**ఉచితం-** నిటాల్ గురించి వివరాలున్న చిన్నపుస్తకం డిస్ట్రిబ్యూటర్ల వద్ద దొరుకును.

ఉత్పత్తిదారులు:

**కొచ్చిన్ పామ్స్ ప్రైవేట్ లిమిటెడ్**

నవరత్న హౌస్, మంత్రా రోడ్, కొచ్చిన్-2.

ఉపయోగించు పద్ధతులను తెలుపు కరపత్రము ప్యాకేజీలో ఉంచబడినది.

మద్రాసు, ఆంధ్రప్రదేశ్, మైసూరు, కేరళ లకు డిస్ట్రిబ్యూటర్లు:

**గణపతి అండ్ కంపెని,**

103/104, లింగిశెట్టివీధి, పి. ఒ. బాక్స్ నెం. 1986. మద్రాసు—1.

# నటుడిగా రాణించాలంటే?
## శ్రీ అక్కినేని నాగేశ్వరరావుతో ఇంటర్వ్యూ

"నేర్చినది కాదు, నేర్వవలసింది చాలా వుంది. చేసింది కాదు, చెయ్యవలసింది చాలా వుంది." అని వంద చిత్రాలు పూర్తి అయిన సందర్భంలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు వినమ్రంగా అన్నారు. ఆ వినమ్రతే ఏ కళాకారుడి విజయానికైనా అవసరమని ఆశించే వ్యక్తి అక్కినేని.

దీపావళితో విడుదలకానున్న 'ఆస్తిపరులు' అక్కినేని 122 వ చిత్రం. ఇంకనూ తాను నేర్వవలసిందీ, చెయ్యవలసిందీ చాలావుందని మొన్న విజయదశమినాడు ఆయన్ని నేను ఇంట్లో కల్సుకున్నప్పుడు చెప్పారు.

నటుడు తన గమ్యానికి చేరుకున్నానని, తన ధ్యేయాన్ని సాధించానని చెప్పజాలడు అని ఆయన నాతో చెప్పారు. ప్రతినటుడికీ తన గమ్యం, తన ధ్యేయం అనుక్షణమూ అందుబాటులో ఉంటూనే అందకుండా వుంటుందని అక్కినేని చెప్పారు.

"నటుడిగా మీరీనాడు ఆక్రమిస్తున్న స్థానానికి చేరుకోవడానికీ, గత 25 సంవత్సరాలుగా ఈ పరిశ్రమలో నిలబడగలగడానికి ఏఏ గుణాలను పెంపొందింప జేసుకోవల్సి వచ్చింది? నటుడిగా రాణించాలంటే....?" అని శ్రీ నాగేశ్వరరావును అడిగాను.

ప్రతివ్యక్తి జీవితంలో విజయం పొందటానికి ఉండవలసిన లక్షణాలే కళాకారుడికి అవసరమని ఆయన అంటారు. "సహన శక్తి కావాలి. విచక్షణా జ్ఞానం అలవర్చుకోవాలి. కళాతృష్ణ పెంచుకోవాలి. సమతా భావం అంతర్లీనంగా ఉండాలి. నిగ్రహ దీక్ష కావాలి. త్యాగనిరతికీ ఆత్మ బలం అత్యంత ప్రధానంగా ఉండాలి," అని అక్కినేని చెప్పారు.

నటజీవితంలో తాను నేర్చుకున్న పాఠాలు కూడా ఇవేనని, సినీమారంగంలో రాణించాలనే ఉత్సాహం కల యువకులైతేనేమి, యువతులైతేనేమి నేర్చుకోవలసిన పాఠాలు కూడా ఇవేనని తాను భావిస్తానని ఆయన అన్నారు.

'సహనశక్తి — చిత్ర పరిశ్రమలో — ఎలా వుండాలంటారు?' అని అడిగినప్పుడు,



అక్కినేని నాగేశ్వరరావు

"సినిమాల్లో చేరగానే ఒకటి రెండు పాత్రలు లభించవచ్చు. ఆ తర్వాత మళ్లీ పాత్రలు లభించక పోవచ్చు. ఇక, చక్కని పాత్రలు లభించడమనేది జరగక పోవచ్చు. అసలు పాత్రలే రావడం లేదని పలువురు నిరాశ పడవచ్చు. మంచి పాత్రలేవీ రావడం లేదని మరికొందరు నిరుత్సాహపడవచ్చు. అలా నిరాశపడితే, నిరుత్సాహ పడితే నిష్క్రమణ తప్పదు. ఆ పరిస్థితులను ఎదుర్కొనగలిగిన ఓర్పు ఉండాలి. మొదలు ఏ పాత్ర లభిస్తే అందులో నటిస్తూ పోవాలి. ఉత్తమ పాత్రలకోసం నిరీక్షించాలి. దానికి సహనశక్తి కావాలి. పైగా కొత్తవారు పరిశ్రమలో అనుకోని సంఘటనలనూ ఎదుర్కోవలసి వస్తుంది. వెంటనే గౌరవం, ఆదరణ లభించలేదనీ భావించరాదు. పరిస్థితులకు అనుగుణంగా నడచుకోవాలి. పరిశ్రమ ఆదేశాలను ఆచరిస్తేనే మున్ముందు ఉజ్జ్వల భవిష్యత్తు కలుగుతుంది. ఉత్తమ అవకాశాలు రాగలుగుతాయి. అప్పుడే తనస్థానాన్ని నిలద్రొక్కుకోగలుగుతాడు. సుస్థిరమైన ఉన్నత స్థానాన్ని చేరుకోగలుగుతాడు కూడా." అని అక్కినేని నాగేశ్వరరావు వివరించారు.

తాను పరిశ్రమలో మొట్ట మొదట ఎదుర్కొన్న పరిస్థితులను తెలిపారు. తనకు లభించిన ప్రతిపాత్రనూ నటించాననీ, తానుమెచ్చిన, తనకు నచ్చిన మంచిపాత్రలు వెంటనే రాలేదని కూడా ఆయన అన్నారు. ప్రతినటికి, నటుడికి ఈ సహన శక్తి అవసరమని ఆయన అంటారు.

'ఎలాంటి విచక్షణా జ్ఞానం నటుడికి అవసరమంటారండీ?' అని అడిగితే, లిప్త కాలం పాటు ఆయన ముఖంపై ఆలోచనా తరంగాలు కదిలాయి. పరిశ్రమలోని వ్యక్తుల దృక్పథాలను అర్థంచేసుకోగల సహనశక్తితోపాటు, వారి దృక్పథాల్లోని మంచిని గ్రహించగలిగే విచక్షణాజ్ఞానమూ అలవర్చుకోవాలి. తపన నటుడికి జీవం. దాన్ని తీర్చుకోడానికి నిశితమైన విచక్షణా శక్తి కావాలని ఆయన అంటారు. క్షీర నీర న్యాయాన్ని ఆచరణలో పెట్టగలిగిన శక్తి కావాలన్నారు.

'తనపాత్రనూ, మిగతా పాత్రలతోగల సంబంధాన్ని, దర్శకుడి భావాల్ని, నటుడు గమనించాలి. యదార్థ జీవితంలో ఆపాత్ర ప్రవర్తనను గుర్తించాలి. ఆ ప్రవర్తనను తెరపై తానెలా ప్రదర్శింప జేయాలో ఆలోచించుకోవాలి. ఇంటర్ప్రెట్ చేసుకోవాలి. అందుకు దర్శకుడి సలహాలు తీసుకోవాలి. ఆ తర్వాత దానిని కెమరా ముందు ఆచరణలో పెట్టాలి." అని శ్రీ నాగేశ్వరరావు చెప్పారు.

విచక్షణాశక్తితోపాటు నటనా సామర్థ్యత కూడా కలిగివుంటే ఆనటుడు ఉన్నత స్థాయికి చేరుకోవచ్చని ఆయన అంటారు.

కళాతృష్ణ గురించి నేను అడుగగా 'అది అనంత మైనది' అన్నారు. నటనలో పరిపూర్ణత అనేది లేదన్నారు.

నిరంతర గమనమే నటుడి కర్తవ్య మన్నారు. ప్రతి పాత్రలోనూ నటుడు ఏదో క్రొత్త విషయం నేర్చుకుంటూనే ఉంటాడు అని చెప్పారు. ఆ తృష్ణ ఎన్నటికీ తీరదన్నారు. అది తీరినదని భావిస్తే నటుడిగా అతను స్తంభించినట్లేనని ఆయన చెప్పారు.

ప్రతి మనిషికీ చాపల్యాలు సహజంగా—>



# దీపావళి



విష్ణుచక్రాలు — ఫోటో: ఎస్. ఎ. [illegible]

సంప్రదాయానికీ ఆచరణకూ సంబంధం సన్నగిల్లిపోవడం, ఎప్పుడో, ఏ కాలంలోనో ఏ భౌగోళిక, పాంచభౌతిక ఘటనలవల్లనో ఏర్పడిన ఆచారాలు కాలక్రమాన వివిధ విషయాలతో మేళవించి విడమర్చరాని నూతన సంప్రదాయంగా రూపొందడం దీపావళి పండుగను పరిశీలిస్తే ద్యోతకమవుతుంది.

నిజానికి దీపావళి పండుగకు, నరకాసుర వధకు సంబంధం ఏమిటి? ఉత్తరప్రదేశ్‌లో జరిపే భరత్ మిలాప్‌కు, దీపావళికీ సంబంధం ఏమిటి?

ఒక సమయంలో ఏదో అపూర్వ ఘటన జరుగుతుంది. దానిని జనం జ్ఞాపకపరచుకొనడానికో, దానివల్ల కలిగిన ప్రయోజనమో నష్టమో జనానికి తెలిసి జాగ్రత్తపడడానికో కొన్ని ఆచారాలు జనం ఆచరణలోకి వస్తాయి. కాలక్రమాన మరికొన్ని అపూర్వ ఘటనలు జరుగుతాయి. ఒక స్వభావాన్ని బట్టి పూర్వకార్య ఘటనల కంటే ఉత్తరోత్తర ఘటనలు బలీయమవుతాయి. కాని పాతవి పూర్తిగా మరుగు కాకుండా తదభిమానులు కొట్టుకుంటుంటారు. దానితో కొత్తనీరు వచ్చి పాతనీరు కొట్టుకుపోతుందనట్లుగా కాక, కొంత కొట్టుకుపోయినా, కొంతైనా మిగిలి, పాతకొత్తల సమన్వయం జరిగి, వింత సంప్రదాయం ఏర్పడుతుంది. అదే దీపావళి విషయంలోనూ జరిగింది.

దీపావళి మనకు అతిప్రాచీన సంప్రదాయానుసరణ వల్ల ఆచరణకు వచ్చిన పండుగ. మనపూర్వులు ఆరునెలలు పగలు, ఆరు నెలలు రాత్రి అనే కాలమానంలో వున్న సమయం మనం ఊహించాలి. ఒకప్పుడు మేష విషువత్తు నుంచి ఉత్తరాయణం, తులా విషువత్తు నుంచి దక్షిణాయనం ఆరంభమయ్యేవని జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెబుతున్నారు. దక్షిణాయన మంటే చీకటి, నరకం. ఉత్తరాయణం వెలుగు, స్వర్గం. ఈ ఆరునెలల రాత్రిని మనపూర్వులు "మహారాత్రి" వ్యవహరించినట్లు పురాణ ధర్మశాస్త్ర గ్రంథాలు తెలుపుతున్నాయి. దక్షిణా

(72వ పేజీ చూ

---

ఉంటాయి. కానీ కళాకారుడు తన చాపల్యాలను అదుపులో పెట్టుకోగలగాలని నాగేశ్వరరావు అంటారు. అందుకు నిగ్రహం కావాలి. అది లేనిచో రాణించడం కష్టం. కొన్ని పదార్థాలు నటులకు చాలా ఇష్టమైనప్పటికీ, మానుకోవలసి వస్తుంది. అందుకు నియమ, నిష్టలు అవసరమంటూ "నేను కడుపు నిండేలా — ఆయాసం వచ్చేలా భోజనం చేసి కొన్నేళ్లయింది" అని ఆయన తెలిపారు.

'ఏ త్యాగానికైనా ఆత్మబలం ముఖ్యమని అన్నారు. అది ఎలా వుండాలని అభిప్రాయపడుతున్నారు?" అని ప్రశ్నించాను.

కళే నటుడికి ఆరాధ్య దైవము. ఎంతో త్యాగం చేస్తేనేకాని తన కళతో ఏకత్వం పొందలేడు. ప్రేక్షకులను ఉత్తేజపర్చలేడు. ఈ త్యాగంలో తనవారి సుఖాలను, తన సుఖాలను వదులుకోవలసి వుంటుంది. షూటింగ్‌లు జోరుగా సాగుతున్నప్పుడు వేళకు ఆహారం దొరకదు, నిద్ర ఉండదు. రాత్రింబవళ్లూ ముఖానికి రంగు రుద్దుకుని కెమెరా ముందు నిలుచోవలసి వుంటుంది. తన కుటుంబంతో హాయిగా, విశ్రాంతిగా గడపడానికి టైము దొరకదు. అందుకే అట్టి త్యాగం చేయడానికి ఆత్మబలం కూడా కావాలని అక్కినేని అన్నారు.

తాను ఉదయం ఆరు గంటలకే వెళ్లి రాత్రి ఏ రెండు మూడు గంటలకో ఇంటికి వచ్చిన రోజులు 1951 — 54 మధ్య ఎన్నో ఉన్నాయని నాగేశ్వరరావు చెప్పారు. సగటున రోజుకు 20 గంటలు పనిచేసేవాడినని తెలిపారు. జీవితమేదో, నటనేదో, నిజమేదో, కలేదో, నిద్రేదో, మెలకువేదో తెలియక తికమక పడిన రోజులవని అన్నా

"ఇంటికి వచ్చినా, ఇంత తిని ఒ తెలియకుండా నిద్రపోవడం తప్ప, ఇం వాళ్లని పలకరించే తీరికా, ఓపికా ఉ కావు" అని అక్కినేని చెప్పారు.

త్యాగాలకు కూడా సిద్ధపడగలిగిన బలం ఉండినందునే, ఈనాడు స్థానాన్ని అందుకోగలిగాడు, ఇన్నే పరిశ్రమలో నిలబడగలగడానికి వీలై

తన కళకై నటుడు ఆత్మ సమ చేసుకోవాలి. అప్పుడే నటన రాణిస్తు ఆ నటుడూ నాలుగు కాలాలపాటు స్తాడు, ఇదే అక్కినేని నాగేశ్వర సుదీర్ఘ సినిమా జీవితపు రాణింపు మౌలిక లక్షణం.

—బాసాని సుదర్శనరె



# నన్ను ప్రేమించరూ...?

రచయిత్రి

నా జీవితం ఒక కావ్యంలా వూహించి, ఆ కావ్యంలో నేను నాయికనని నమ్మినట్లు భ్రమించి ఉత్తరాలు రాస్తూ వుంటారు కొందరు అభిమానులు. జీవితం కావ్యం అయితే, అందులో నాయికనైతే—అంతాలు విరబూచే ప్రకృతితో పరవశించిపోవాలని కోరుకోవడం తప్ప వేరే ఆనందం ఏమి ఉంటుంది?

అనునిత్యమూ అసంఖ్యాకంగా వచ్చే అభిమానుల ఉత్తరాల్లో కొన్ని మరీ గమ్మత్తుగా వుంటాయి. నటన పోషించే సినిమాలలోనే కాక నిజ జీవితంలో కూడ జరుగుతున్నదేమో అనిపిస్తుంది ఒక్కొక్క సారి, అవి చదువుతుంటే.....

ఒకసారి ఒక ఉత్తరం వచ్చింది. బహుశ కొత్తగూడెం నుంచి అనుకుంటా. "లక్ష రూపాయలు తెస్తాను. ఈ నెల 29 వ తేదీన సాయంకాలం 4 గంటలకు విల్డన్స్ పార్కుకి రండి. ఎక్కడైనా వెళ్ళిపోయి పెళ్ళి చేసేసుకుందాం." అంటూ రాశారు ఒకరు. జీవితం నుంచి తప్పించుకు పారి పోవడం అంత సులభమా? నవ్వొచ్చింది.....

"స్లైట్ కాస్ట్యూమ్స్ వేసుకోవద్దు, ఫలానా చిత్రంలో మీరు అవి వేసుకోగా చూసి ఎంతో బాధపడ్డాను. ప్లీజ్. ఇకపై వేసుకోకండి. మీరు చీరలోనే ఎంతో బాగుంటారు." అంటూ కాకినాడ నుంచి ఒక ఇంజనీరింగ్ స్టూడెంటు రాశారు. అలాగే విజయవాడ, గుంటూర్ల, విశాఖపట్టణం, బాపట్ల, నెల్లూరు మొదలైన చోట్లనుండి అనేక లేఖలు వచ్చాయి. సినిమాల్లో వస్త్రధారణ మన ఇష్ట ప్రకారం జరుగుతుందా? వేషానుగుణ్యమైన దుస్తులు వేసుకోవలసి వుంటుంది. ఒకోసారి అవి వేసుకోక తప్పదు....

ఈ మధ్య అనంతపురం వెళ్ళినప్పుడు "మీరు లైట్ రోల్స్ మాత్రమే వేయండి. బరువైన వేషాలు వేయవద్దు. మీరు ఏడిస్తే మేమూ ఏడవవలసి వస్తుంది. వద్దు, అక్కా!" అన్నారు, కొందరు సోదరీ మణులు. చిత్రాలలో ఆయా సందర్భాలు వచ్చినపుడు దుఃఖించక తప్పదని వారికి ఎలా నచ్చచెప్పేది... వారి అభిమానానికి హృదయం ద్రవించింది.

తీరిక వేళల్లో వచ్చే ఉత్తరాలన్నిటినీ ఒక్కొక్కటిగా చదువుతూ వుంటే.... ఇలా ఎన్నో అనుభూతులు కలుగుతూ వుంటాయి. కొంత మంది అమ్మాయిలు జట్లు జట్లుగా వచ్చి అరచేతులు చాపి సంతకాలు పెట్టమంటుంటారు. ఊపిరి సలపనివ్వకుండా ఒకటే ప్రశ్నలు వేస్తారు.

మరొక తమాషా అయిన సంగతి చెప్పనా... ఒక రోజున మధ్యాహ్నం మూడు న్నర గంటల వేళ స్నానం చేసి షాపింగ్ కి వెళ్దామని తయారవుతున్నా. ఇంతలో ఫోన్ కాల్ వచ్చింది. రిసీవ్ చేసుకున్నా. ఎవరో రాజాట! విషయం ఏమిటో చెప్ప కుండా కుశల ప్రశ్నలు వేయసాగారు. "ఏం కావాలి" అన్నాను. "మీరంటే నాకెంతో ఇది. మిమ్మల్ని ప్రేమించాను. తరగని ఆస్తిపాస్తులున్నాయి. ప్లీజ్ నన్ను ప్రేమించరూ?" అన్నారు.

"ప్రేమా! అంటే?"

"నన్ను పూర్తి తెలియాలని నాకు ప్రేమంటే మీకు తెలియదా? మనసిచ్చి పుచ్చుకోవడం."

"నా మనస్సు మీకిచ్చేయమంటారా? ఏంలేదు మనస్సు మీకిచ్చేసి శూన్యంతో మిగిలి పోలేను."

"అబ్బా అది కాదండీ. అమ్మ! నన్ను ప్రేమించ మంటున్నాను."

"సారీ" అన్నాను. "ప్రేమంటే నాకు తెలీదు. తెలుసుకున్న వెంటనే మీకు ఫోన్ చేస్తాను."

"మర్చిపోకండేం — మరి!" అంటూ ఫోన్ నెంబరు ఇచ్చారు.

— ఇక ప్రేమ లేఖల విషయానికి వస్తే కోకొల్లలు. రోజూ వస్తూనే వస్తూంటాయి. ప్రాణాధికంగా ప్రేమి స్తున్నామంటూ ఫోన్లో పిలిచి చెబుతారు కొందరు. నాకే చిన్న దెబ్బ తగిలినా సహించలేరు యింకొందరు. ఆరోగ్యం సరి చూసుకోమనీ, విశ్రాంతి బాగా తీసుకోమనీ చెబుతూ వుంటారు మరి కొందరు.

వీరంతా నా శ్రేయోభిలాషులు. నన్నూ నా నటననూ అభిమానించేవారు. నా కృషికి తోడ్పాటు యిచ్చేవారు. వారి ఆదరాభిమానాలను కలకాలం కృతజ్ఞతతో గుండెల్లో నిలుపుకోగలనే తప్ప — వారికి నేను ఏం చేయగలను?

టి. కృష్ణకుమారి



# కమ్యూనిస్టు దేశాలలో కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్

ఆర్. వెంకట్రామన్

(గత సంచిక తరువాయి)

వాల్గాగ్రాడ్ నగరం చేరి, విమానం నుంచి దిగిన వెంటనే కామరాజ్‌కు "మనం మళ్ళీ ఒకవేళ ఢిల్లీ చేరామా!" అనే భ్రమ కలిగింది. విమానం తలుపు తీయగానే ఢిల్లీలో వీచే వేడిగాడ్పులు లోపలికి కొట్టి మమ్మలను మాడిపోయేట్లు చేసింది.

విమానాశ్రయానికి నగరం మేయరు శ్రీ శోరోతోవ్, ఆయన మిత్రులు కామరాజ్‌కు స్వాగతం చెప్పారు. మేము ప్రభుత్వ గృహం చేరేవేళకు రాత్రి ఏడుగంటలయింది. అయినా మన వూరిలో సాయంకాలం నాలుగు గంటలకు వుండే ఎండ వుంది. రాత్రి చాల పొద్దుపోయిన తర్వాతనే సూర్యుడు అక్కడ అస్తమిస్తాడు. తేనీరు పుచ్చుకున్న తర్వాత "నగరంలో తిరిగిరావచ్చు గదా!" అని బయలుదేరారు కామరాజ్.

చరిత్ర ప్రఖ్యాతి పొందిన ఈ వాల్గాగ్రాడ్ నగరానికి పూర్వం "స్టాలిన్‌గ్రాడ్" అనే పేరు వుండేది. స్టాలిన్ మరణానంతరం ఆయనకు సంబంధించిన ఏ చిహ్నమూ వుండరాదనే నిశ్చయంతో ఈ నగరం పేరు గూడ వాల్గాగ్రాడ్ అని మార్చి వేశారు. ఆ ప్రాతిపదిక పైనే రసాయన తైలాలతో భద్రపరచబడిన స్టాలిన్ భౌతికకాయాన్ని కూడ రూపుమాపారు.

"ప్రపంచ ప్రఖ్యాతి పొందిన నదుల పేర్లు చెప్పు" అని భూగోళశాస్త్ర విద్యార్థిని ఎవరినైనా మనం అడిగితే, అతడు గంగ, నైల్, వాల్గా అని చెబుతూపోతాడు. ఆవిధంగా ప్రశంస పొందిన వాల్గా నదీ తీరంలో ప్రాచీనమైన మహత్తరమైన నాగరికత ఒకటి ఉన్నట్లు చెబుతారు పురాతత్త్వవేత్తలు. చారిత్రకమైన విఖ్యాతి మాత్రమే కాక పొడవు, విస్తారం, జల ప్రవాహం మొదలయిన విషయాలలోను బ్రహ్మాండంగా వున్నందువల్ల గొప్ప ఖ్యాతి పొందినదే. మన బ్రహ్మపుత్రానది లాగ వెడల్పయిన ఈ నది వెడల్పు కొన్నిచోట్ల రెండు మైళ్ల మేర కూడ వుంది. ఇంత కీర్తి పొందిన నదీతీరంలో వెలకొని వున్న ఈ నగరానికి ఆనదికి సంబంధించిన పేరే గదా వుండాలి? ఈ విధంగానే 1589వ సంవత్సరంలో వాల్గాగ్రాడ్ నగరం ఏర్పడింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి ముందు స్టాలిన్‌గ్రాడ్ పారిశ్రామిక రంగంలో మహత్తరమైన పురోగతిని సాధించింది. ఆ పురోగతి హిట్లరు దృష్టిని ఆకర్షించింది. అందువల్లనే స్టాలిన్‌గ్రాడ్‌ను పట్టుకుంటే విజయం తథ్యమనే నిశ్చయంతో హిట్లరు సైన్యాలు వాల్గానది ఆవలి తీరాన్ని బలంగా ముట్టడించాయి.

1942వ సంవత్సరం ఆగస్టు నెల మొదలు 1943 ఫిబ్రవరి నెల వరకు స్టాలిన్‌గ్రాడ్ వీధులలో నాజీ సైన్యాలకు రష్యా సైన్యాలకు రాత్రనక పగలనక తీవ్రమైన పోరాటం జరిగింది. ఆ పోరాటం లక్షల కొలది ప్రాణాలను బలిగొన్నది. నగరంలోని పెక్కు భాగాలు నాశనమై, కొన్నిచోట్ల భవనాలు నేలమట్టమయాయి. నూటికి పైగా కర్మాగారాలు రూపులేకుండా పోయాయి.

ఆఖరుకు సోవియట్ సైన్యాలు నాజీ సైన్యాలను రెండు వైపుల నుంచి చుట్టుముట్టాయి. ఆ యుద్ధతంత్రం వల్ల నాజీ సైన్యాలు శరణు పొందాయి. 90 వేల మంది నాజీ సైనికులు పట్టుబడ్డారు. ఈ పతనం వల్ల నాజీ సైన్యాలు స్టాలిన్‌గ్రాడ్ వైపుగా పురోగమించలేక కొట్టుకున్నాయి. యుద్ధం కొనసాగినంత వరకు నాజీ సైనికులు స్టాలిన్‌గ్రాడ్ వైపు అడుగు ముందుకు వేయడమే సాధ్యం కాకపోయింది.

నగరం మేయరు కామరాజ్‌ను మొదట పిలుచుకొనిపోయిన స్థలం వాల్గానది సమీపంలో వున్న అత్యంత రమణీయమైన ఉద్యానవనం. దానిని చూచి ఆనందించిన తర్వాతనే యుద్ధం జరిగిన ప్రాంతాలకు మమ్మల్ని పిలుచుకొని వెళ్లారు మేయరు. అంతిమ పోరాటంలో భగ్నమై ముక్కలుగా చెదరిపోయిన ఇండ్లు, ఫిరంగులు, ఫిరంగి గుండ్లు తుపాకులు మొదలయిన వాటితో ఏర్పరచిన ఒక యుద్ధకాల స్మారక భవనానికి మమ్మలను పిలుచుకొని వెళ్లారు. ఈ స్మారక భవనం మామయా పర్వత శిఖరంపై నిర్మించబడింది. యుద్ధపు ఘోరకృత్యాలను, వాటివల్ల ప్రాణాలు కోల్పోయిన వారిని దయనీయంగా వికలాంగులయిన వారిని, ఆ స్మారక భవనంలో చిత్రించారు. కళ్లు చెదరగొట్టే దృశ్యమది. ఆ భవనం మీద ఒక యుద్ధవీరుని శిలావిగ్రహం "ఈ దేశాన్ని ఏనాడైనా కాపాడుతాము" అనే నినాదంతో నిలబడిన భంగిమతో స్థాపించారు. వీటినన్నిటిని మాకు చూపిన నగరం మేయరు వాల్గాగ్రాడ్ పౌరుల "మరణించే వరకు పోరాడుతాము" అనే ప్రతిజ్ఞ చేసుకున్నారనే విషయాన్ని ఎంతో గొప్పగా ప్రత్యేకించి చెప్పారు.

ఈ యుద్ధస్మారక చిహ్నాలు చూచిన కామరాజ్ హృదయం కృంగిపోయింది. "ఇన్ని ప్రాణాలు నశించడం అవసరమా?" ప్రపంచంలో యుద్ధం అనివార్యమైనదా ? అని భావించారు.

అక్కడ పునర్నిర్మాణమేమీ చేయక పాతదిగా వున్న ఒక కట్టడాన్ని కామరాజ్‌కు మేయరు చూపుతూ "ఈ కట్టడంలో ఏడెనిమిది మంది తమ జీవితాన్ని దుమ్ముగా భావించి, కట్టడం కాలిపోతున్నా లక్ష్యపెట్టక కాలు కదల్పక నిలబడి, నాజీ సైనికులు చేసిన ప్రయత్నాలన్నిటినీ ధ్వంసం చేసి, వారిని ఓడగొట్టారు. అందువల్ల ఈ కట్టడాన్ని ఒక స్మారక చిహ్నంగా భద్రపరచుకున్నాము. వీటిని అన్నిటినీ భద్రపరిచికాపాడుకొంటూరావడంలో మాకొక లక్ష్యం వుంది. వీటన్నిటిని చూచి, యుద్ధం వల్ల కలిగే కీడును వచ్చే తరాలవారు తెలుసుకోవాలనేదే 'ఆ లక్ష్యం'" అన్నారు.

సంవత్సరంలో పదినెలలు చలి హెచ్చుగా వుండే ప్రదేశం వాల్గాగ్రాడ్. అందువల్ల ఆ నగరంలోని ఇండ్లలో ఎలక్ట్రిక్ పంఖాలో, శైత్య సాధన యంత్రాలో(ఎయిర్ కండిషన్ యంత్రాలో) వుండవు. మాకోసం ఎక్కడి నుంచో రెండు టేబిల్ ఫ్యానులను తెచ్చిపెట్టారు. అయినప్పటికీ రాత్రి వేడికి మాకు నిద్ర పట్టలేదు.



మేము విడిసిన భవనం ఎంతో ఎత్తయి నప్పటికీ, ఎన్నో వసతులు చేయబడి నప్పటికీ రాత్రి చాల వేడిగా వున్నందున చాల సేపటి వరకు మాకు నిద్ర పట్టలేదు.

మరుసటి రోజు ఉదయం ఫలహారం చేసేటప్పుడు "మీకు రాత్రి ఎలా వుంది?" అని నన్ను అడిగారు కామరాజ్.

"గది ముందున్న వరండాలో గడ్డ పరచుకుని పడుకున్నాను. మా వూళ్లో పడుకున్నట్టే వుండినది." అన్నాను.

రష్యాలో ఉదయం ఫలహార సమయంలో పెరుగు వడ్డించడే అలవాటుంది. మనకు ఉదయంపూట పెరుగు పుచ్చుకునే అలవాటు లేకపోయినప్పటికీ, ఆ రోజు ఎండ వేడిమికి పెరుగు పుచ్చుకోడం ఎంతో హాయిగా వుండింది.

మేయర్ కార్యాలయానికి వెళ్ళినప్పుడు యుద్ధానంతరం వాల్గాగ్రాడ్ పూర్తిగా పునర్నిర్మాణం చేయబడిందని, అక్కడున్న కట్టడాలు, కార్యాలయాలు, వీధులు, రోడ్లు అన్నీ పూర్తిగా కొత్తవేననే వివరాలను మేయర్ తెలిపారు.

వాల్గా నదీతీరంలో 45 మైళ్ళ పొడవున వున్న ఈ నగరం జనాభా తొమ్మిది లక్షలు. 136 పాఠశాలలు, 300 లకు పైగా నర్సరీ పాఠశాలలు, 18 వృత్తి పాఠశాలలు వ్యవసాయ కళాశాల, వైద్యకళాశాల, వస్తు ప్రదర్శనశాలలు, ఈత మడుగులు మొదలయినవి ఎన్నో వున్నాయి. రాకపోకలకు ట్రాలీ బస్సులు, ట్రాములు, పడవలువంటి వసతులు వున్నాయి. ఏటా పదివేల యిళ్ళు కడుతున్నామని, గృహవసతి సమస్య తీవ్రంగానే వున్నదని మేయరు అన్నారు.

"విద్యా శిక్షణ వుచితమే కదా!" అని అడిగారు కామరాజ్.

"ఔను. పాఠశాలలలోను, కళాశాలలలోను, చదువుకు ఫీజు అనేది పుచ్చుకోడమే లేదు. అంతేకాక అర్హతగల విద్యార్థులకు స్టైపెండ్ కూడా ఇస్తున్నాము" అన్నారు మేయరు.

"వైద్య సౌకర్యం ఎలా?" అని అడిగారు కామరాజ్.

"అదికూడా ఉచితమే. మా సోవియట్ యూనియన్‌లో డాక్టర్లెవరూ స్వతంత్రంగా ప్రాక్టీసు చేయడానికి వీలులేదు. ఏదో ఒక సంస్థలో వుండే ఏ డాక్టరైనా పని చేయాలి." అన్నారు మేయరు.

తర్వాత మేయరు ఎన్నో సమస్యలను గురించి మాట్లాడారు. ఆఖరుకు మంచి నీటి సమస్య వచ్చింది.

"ఈ ప్రాంతంలో మంచినీటి ఎద్దడి సమస్య అతి తీవ్రంగా వుంది. అందువల్ల ఉత్తరాన అట్లాంటిక్ ప్రాంతానికి పారే నదులను తిప్పి దక్షిణానికి తేవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి" అన్నారు.

"నీటి కరువు వల్ల కాస్పియన్ సముద్రం కొంచెం కొంచెంగా వట్టిపోతున్నదని, దానికి తగినంత నీరు పోయి చేరడానికి దారి చేయాలని మేయరు తెలిపారు. ఈ ప్రయత్నాల పట్ల ఇరాన్ రాజు ఎక్కువ శ్రద్ధ చూపుతున్నారని, కాస్పియన్ సముద్రం ఇరానుకు అత్యవసరమయినందున ఈ పథకాన్నిపూర్తి చేయడానికి ఇరాన్ చాల శ్రద్ధ వహిస్తున్నట్టు చెప్పారు.

వాల్గాగ్రాడ్ నగరం సాలుసరి రాబడి ఏడు కోట్ల రూబుళ్ళు; అంటే 56 కోట్ల రూపాయలు. ఇది ఎక్కువగా కర్మాగారాల నుంచి, కొద్దిగా చిన్న పన్నుల మూలంగాను వలుగుతున్నదని చెప్పారు. పన్నులను గురించి ప్రశ్నించగా, పెళ్ళికానివారికి ఒక ప్రత్యేకమైన పన్ను విధించబడుతుందని అన్నారు. మొత్తం రాబడిలో 62 శాతం విద్యావైద్య సౌకర్యాలకు, ఒక శాతం మాత్రమే పరిపాలన నిర్వహణకు వినియోగించబడుతుందని తెలిపారు.

"మొత్తం రాబడి అంటే ఏమిటి?.." అని వివరణ అడుగగా, "మునిసిపల్ కార్పొరేషన్ రాబడి మాత్రమే కాదు. కర్మాగారాల రాబడి కలిపి" అని సమాధానం చెప్పి మాకు ఆశ్చర్యం కలిగించారు మేయరు.

కామరాజ్ వాల్గాగ్రాడ్ ఆగమన చిహ్నంగా "మరణించే వరకు పోరాడుతాము" అని శపథం చేసిన యుద్ధవీరుని విగ్రహా మొకటి ఆయనకు బహూకరించబడింది.

మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయం నుంచి కామరాజ్ వెళ్ళిచూచిన తర్వాతి భవనం ఒక నర్సరీ పాఠశాల. అక్కడ గంటన్నర సేపు పిల్లలతో వుల్లాసంగా కాలం గడిపారు కామరాజ్.

తల్లిదండ్రులు పనికి వెళ్ళేటప్పుడు తమ పిల్లలను వదలిపెట్టి వెళ్ళడానికిగానే ఏర్పాటు చేయబడిన నర్సరీ అది. ఉదయం పిల్లలను అక్కడ వదలిపెట్టి సాయంకాలం వారిని ఇళ్ళకు పిలుచుకుని పోతారు. ఆ వ్యవధిలో పూర్తిగా ఆ పిల్లలను ఎంత మాత్రం విసుగు, విరామం లేక కన్న తల్లులలాగే నర్సరీ నిర్వాహకోద్యోగినులు చూచుకుంటారు.

కొందరు తలిదండ్రులు మరొక గ్రామానికి వెళ్ళేటప్పుడు గూడ తమ పిల్లలను

(58 వ పేజీ చూడండి)



స్టాలిన్‌గ్రాడ్ 'మమేవ్ హిల్' మీద






"అమ్మాయి! మీ ఆయన పిలుస్తున్నా డమ్మా" అని నాన్నగారు కేక వేశారు. "వస్తున్నా నాన్నా!" అంటూ శ్యామల వంట యింట్లోంచి కేక పెట్టింది కాని, కూర్చున్న చోటునుంచి కదల్లే.

సంక్రాంతి పండగ రేపు. ఇల్లంతా చాలా హడావిడిగా వుంది. ఈ ఏడు నిరుడు సంక్రాంతి లాంటిది కాదు. ఢిల్లీకి అవతల ఎక్కడో పంజాబులో పనిచేసే రామం యీ సారి యింటికి రావటం, అన్నయ్యని చూడటం ఎప్పుడా? ఎప్పుడా? అని ఎదురు చూస్తున్న శ్యామల, వాళ్ళ ఆయనను కూడా వెంటబెట్టుకుని రెండు రోజులు ముందు గానే పుట్టింటికి రావటం. అసలు అన్నింటి కంటే ముఖ్యమయిన విషయం, పెళ్లి అయిన తరువాత శ్యామల భర్త అత్తవారి యింటికి రావటం కాని, కాపురానికి వెళ్ళిన తరువాత శ్యామల పుట్టింటికి రావటం కాని యిదే మొదటిసారి. అందుకనే అందరికీ అందల మెక్కినంత సంబరంగా వుంది.

ముసలాయన మనస్సులో, ఆ రోజల్లా మసలిన మాట ఒకటే. అమ్మాయి, అల్లుడు యింటికి వచ్చారు ఎన్నో ఏళ్ళ తరువాత. అబ్బాయి రామం యింటికి వచ్చాడు. కొడుకులు లేని తనకు, అన్న కొడుకే స్వంత కొడుకు అయ్యాడు. బాబాయి బాబాయి! అంటూ అహర్నిశలు తనదగ్గరే వుంటాడు. వాడికి తన్నా, శ్యామల అన్నా పంచప్రాణాలు. కాలేజీలో ఉపన్యాసాల పోటీలో ఫస్ట్ ప్రైజు వచ్చినప్పుడు ఆ డబ్బు పెట్టి, శ్యామలకు మంచి వోణీ కొనిచ్చాడు. కాని దైవనిర్ణయం ఎవరు తప్పించగలరు? తీరా సమయం

వచ్చేసరికి శ్యామల పెళ్ళికి రాలేకపోయాడు. పెద్ద చదువుల కోసమని జర్మనీ వెళ్లి పోయాడు. బంధు కోటి యావన్మంది వచ్చినా, వాడు లేకపోవడంవల్ల పందిరి వెలితిగానే వుంది. కాని ఎన్ని బహుమతులు పంపించాడు! ఎంత సంబరపడుతూ ఉత్తరం రాశాడు?

వాడు తన యింటికి తిరిగి వచ్చేసరికి, తనకు వెయ్యేనుగుల బలం వచ్చింది. రామం వూళ్లోకి వచ్చాడని తెలియగానే, అబాల గోపాలం, రెక్కలు కట్టుకుని తన యింటి దగ్గర వాలారు. వాడంటే వూళ్లో అంద రికీ ఎంత యిష్టం!! ఆడ వాళ్లు పలుక రించినా సిగ్గుపడే జానకి కూడా, వాళ్ల ఆయన్ని వెంటబెట్టుకునివచ్చి, రామాన్ని పలుకరించి వెళ్లింది. ఆశ్చర్యం ఏమి టంటే, ఆ అమ్మాయిని చూడగానే, రామం తనే, ఆడపిల్లకన్నా సిగ్గు పడ్డాడు. అసలు వాళ్ల పిన్ని అన్నట్టుగా, అబ్బాయి జర్మనీ వెళ్లకుండా వుండి వుంటె, జానకి, మా యింటి కోడలే అయివుండేది. అయినా ఎవరు, ఎవరికి, రాశిపెట్టి వున్నారో ఎవరికి తెలుసు. ఆ ఘడియవస్తే ఆ మూడు ముళ్లు అలా పడితీరవలసిందే! ఆపడానికి బ్రహ్మతరం కూడా కాదు.

"శ్యామలా!" అంటూ అల్లుడి కంఠం గదిలోంచి వినిపించింది. కంఠస్వరంచూస్తే అతగాడికి కోపం వచ్చినట్టు వుంది. అసలే అదో మాదిరి మనిషి. ఎంత చదువూ సంపదా వుంటేమాత్రం ఏం లాభం! చిన్న పిల్లవాడిలాగా ప్రవర్తించుతాడు.

ఆడదాని సలహా ఏ విషయంలో విన్నా, కుమార్తె వివాహం విషయంలో వినడం తను చేసిన మొదటి పొరబాటు. వివాహం అయిన మరునాటి నుంచి తన మనస్సు కలుక్కు మంటూనే వుంది. నిక్షేపం లాంటి మేనరికం వుండగా, భార్య పోరు పడలేక, శ్యామలను పరాయి సంబంధంకు యివ్వవలసి వచ్చింది. 'నా అల్లుడు ఉద్యో గస్థుడు కావాలి. ఎంత మేనల్లుడైనా, ఎంత ఎమ్మే ప్యాసు అయినా, యిరవై నాలుగు గంటలు పొలంలో పడి గొడ్డు చాకిరి చేసే ఆ సంబంధం మా పిల్లకు అక్కర్లేదు.' అని సీతమ్మగారు మంకు పట్టు పట్టింది. వీరభద్రయ్యగారు వోడి పోయారు. శ్యామలకు పరాయి సంబంధమే ఖాయమయింది. అక్కయ్య మనసు అమృతం లాంటిది. శంకరం నిజంగా భోళా శంకరుడే. అందుకనే శ్యామల పెళ్ళి అని ఉత్తరం రాయగానే, పది రోజుల ముందరేవచ్చి, యిద్దరూ యింటెడు చాకిరీ చేసి పెట్టారు. అక్కయ్య కనీసం కలలో కూడా అడగలేదు. "ఏంరా! తమ్ముడూ, మా శంకరానికి వచ్చిన లోటు ఏమిటి? చిన్నప్పటినుంచి మనం అను కుంటున్న మాటేగదా" అని తనకు గుర్తు కూడా చెయ్యలేదు. తమ తోటలో పండిన మామిడి కాపు అంతా యిక్కడకు పట్టించుకుని వచ్చింది. సరే ఇహ శంకరం సంగతి చెప్పనే అక్కర్లేదు. రెండు వందల రూపాయలు పెట్టి మంచి కంచి పట్టుచీరె తీసుకుని వచ్చాడు.

పెళ్లిలో ఎవరి ముఖంలోనన్నా రవ్వంత చీకటి కనిపిస్తే అది ఒకటి రెండుసార్లు శ్యామల ముఖంలోనే.

కాని ఆశ్చర్యం ఏమిటంటే, "అమ్మా నీకు యీ సంబంధం యిష్టమేనా" అని తను శ్యామలను ఒంటరిగా పిలిచి అడిగాడు. బావని చేసుకోవాలని వుంటే చెప్పు తల్లి నేను యీ సంబంధం రద్దు చేస్తాను" అని తరిచి తరిచి అడిగాడు. కాని శ్యామల అన్నమాట తనకు అర్థం కాలేదు.

"అమ్మ మనస్సు తీరేదెల్లా నాన్నా?" అని అడిగింది.

"అది కాదు తల్లి!".... అంటూ తనేదో చెప్పబోయాడు.

"నాకు యీ సంబంధం యిష్టమే నాన్న. మీరు లేనిపోని ఆలోచనలు పెట్టు కుని మనస్సు పాడు చేసుకోకండి."

నాన్న ఏం మాట్లాడ లేదు. కాని ఆయన మనస్సు మాత్రం మనస్సులో లేదు. శ్యామల వివాహంతో, శ్యామల ఒకర్తే కాదు అంతా కూడా తనకు పరాయి వాళ్లు అయిపోయినట్టు అనిపించింది.

జర్మనీ నుంచి రామం రెండే, రెండు వాక్యాలు రాశాడు.

"చిన్నాన్నా— మీ నిర్ణయం నాకు ఆశ్చర్యం కలిగించింది. బాగా ఆలోచించే యీ నిర్ణయానికి వచ్చారను కుంటాను."

కాపురానికి వెళ్లిన తరువాత శ్యామల రాసిన ఉత్తరంలో ఒక వాక్యం చాలా రోజుల దాకా తనకు అర్థం కాలేదు.

"ఎవరి అదృష్టం వాళ్లది. ఎవరు తప్పించ గలరు అన్న వాక్యంలో ఎంత నిజం వుంది నాన్నా!" అంటూ శ్యామల ఎందుకు రాసిందో తనకు తెలిసిన నాడు, తను చేసిన మొదటి పని దైవాన్ని విస్మ రించడం. ఆయన్ని స్మరిస్తే ఆయిన్ని దూషించడం తప్ప, భూషించగల సహసం గాని, స్థోమతగాని తనకు లేవు.

"మధు పర్కం బట్టలు చిరిగిపోతే పారేయకండి. ఎవరికీ యివ్వవద్దు. మీకు పుట్టే పిల్లలకు ప్రక్కకు వేయాలి. అది మన ఆచారం" అని సీతమ్మగారు శ్యామ లకు ఉత్తరం రాసింది.

"నీకు ఆ భయం అక్కర్లేదమ్మా ఈ యింట్లో పసిపాపలు వుండరమ్మా" అని శ్యామల రాసిన సమాధానం, సీతమ్మ గారి మనస్సును చిత్రవధ చేసింది. నేరం ఇతరుల మీదకు నెట్టుతేనే కాని ఆవిడ మనస్సుకు ఉపశమనం కలగలేదు.

"నా కూతురుకు యిటువంటి ముద నష్టపు సంబంధం చేస్తారా? మీ అక్కయ్య కొడుక్కు యివ్వ వద్దన్నాననీ, యిలా దాని గొంతుకు తడి గుడ్డతో కోస్తారా!" అంటూ వరద లాగా తన మీదకు దాడికి వచ్చింది.

వీరభద్రయ్యగారు యివ్వగలిగిన సమా ధానం కరుడు కట్టిన కన్నీళ్లే! శ్యామల ఎన్నడూ రాయలేదు కాని, వాళ్లూ వీళ్లూ అన్న మాటలని బట్టి తెలిసినదల్లా ఒకటే, అల్లుడు శ్యామలను చాలా ఆరడి పెడతా డని, దానికి అతని దగ్గర చనువుగాని స్వతంత్రం గాని లేదని, సాహెబ్బుల కంటే ఎక్కువ ఘోష అని. "విడాకులు యిప్పించి శ్యామలకు మళ్లీ పెళ్లి చేస్తే! ఛీ! ఛీ! ఏమిటూ పాడు ఆలోచనలు" అంటూ ఆలోచనలు అక్కడితో ఆగిపోయేవి.

అమ్మాయి అల్లుడూ వస్తున్నారు. మన రామం కూడా వస్తున్నాడు. మీరు కూడా



రావలసింది, అని అక్కయ్యకు శంకరానికి ఉత్తరాలు రాశాడు.

"ఆరోగ్యం బాగా లేదు. ఈ చలికాలంలో ప్రయాణం చెయ్యలేను. పైగా యివి మామూళ్ళ రోజులు. కుప్పలు వదిలిపెట్టి రావడం కష్టం" అంటూ అక్కయ్య సమాధానం రాశింది.

"శుక్రవారం రాత్రికి వస్తున్నాను" అని శంకరం దగ్గర నుంచి టెలిగ్రాము వచ్చింది.

హమ్మయ్య!! అని మనస్సు ఎంతో హాయిగా శ్వాస తీసుకోగలిగింది.

శంకరం యీ రోజు రాత్రికి వస్తున్నాడు. తనవాళ్ళు అనుకున్నవాళ్ళంతా యీ నాడు యిక్కడ వున్నారు. లేనిదల్లా సీతమ్మగారు ఒక్కరే. ఉన్న ఒక్క కూతురు బ్రతుకూ తనవల్ల యిల్లా అన్యాయం అయి పోయిందని ఆవిడ మనస్సులో నాటుకోగానే, ఆ రోజునే ఆవిడ ఒక నిర్ణయానికి వచ్చింది. అది ఆవిడ మనస్సుకి తప్ప ఎవరికీ తెలియదు. తెలిసినదల్లా సీతమ్మగారి రుగ్మత, నివారించగల ఔషధం యింకా ఎవరూ కనిపెట్టలేదని. "బ్రతకాలని కోరికా, పట్టుదల వున్న వాళ్ళకు మేము వైద్యం చెయ్యగలం కాని, ఆ కోరిక లేని వాళ్ళకు ఏ మందూ పని చేయదు." అని డాక్టర్లు ఒకటికి పదిసార్లు చెప్పారు. స్థలం మార్చి చూశారు. గాలి మార్పు చేశారు. అందరి అదృష్టాలకు బాధ్యత తమదేనని, యీ జన్మలో చేసిన పాపాలకు యీ జన్మలోనే పరిహారం చెల్లించాలని పట్టుబట్టె వాళ్ళని, భగవంతుడు కూడా కాపాడలేడు. ఆనాడు, ఆ సీతమ్మ తల్లి, భూమాతవడిలో తలదాచుకుంటె, యీ సీతమ్మగారు పంచ భూతాలలో కలిసి పోయారు.

"ఆవిడ కేం అదృష్టవంతురాలు. అన్ని బాధ్యతలు తీరిపోయాయి, ఇంత పసుపు కుంకంతో వెళ్ళిపోతోంది" అని ఆవాడ కట్టు అంతా, అంత దుఃఖంలోనూ, ఆవిడని కొనియాడారు. సీతమ్మ తల్లి, తన దోవను తాను వెళ్ళి పోయింది. అందరి బాధలు చూడమని, లోలోపల కుమిలి పొమ్మని భగవంతుడు అందరి అన్యాయం తనకే పోశాడు. ఎన్ని యుగాలు గడిస్తే, తన బ్రతుకు తెల్లవారటమో కదా!

"శ్యామలా!!!" అంటూ అల్లుడి కంఠం వినిపించింది. ఈ సారి వీరభద్రయ్యగారు

# ఔటర్ సిగ్నల్

తనే స్వయంగా శ్యామల వున్న చోటుకు వెళ్ళాడు. వంట యింట్లో కంచాల దగ్గర కూర్చొని, భోజనాలు, పూర్తి అయినా లేవకుండా, శ్యామలా, రామం కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అన్నయ్యా! నువ్వు పంజాబీ అమ్మాయిని చేసుకుంటావా? జర్మనీ అమ్మాయిని చేసుకుంటావా?" అని శ్యామల అడుగుతోంది.

"అన్నయ్య యింకా నెల రోజులపాటు వుంటాడు. అన్ని ప్రశ్నలు తీరికగా అడగవచ్చును గాని, అక్కడ మీ ఆయన పిలుస్తున్నాడు ఏం కావాలో కనుక్కో?" అని ముసలాయన అన్నాడు.

భర్త మాట వినగానే శ్యామల ముఖం గంభీరంగా మారింది. చెయ్యి కడుక్కుని భర్త గదిలోకి వెళ్ళింది. అక్కడ అతను రైల్వే టైమ్ టేబుల్స్ చూస్తున్నాడు.

శ్యామల గదిలోకి వస్తూనే "ఏమండి మంచి నీళ్ళు కావాలా?" అని అడిగింది.

"బట్టలు సర్దుకో మన వూరు వెళ్ళిపోదాం".

శ్యామల అర్థం కానట్టు నిలబడింది.

"అల్లా చూస్తావేం. బట్టలు సర్దుకోమంటూంటె".

"ఏమిటండి మీరంటున్నది నాకేం అర్థం కావటం లేదు".

"మనం మన వూరు వెళ్ళి పోతున్నాం, బట్టలు సర్దుకో".

"పండగలు రేపటి నుంచి. మనం పండగల కోసమని యీ వూరు వచ్చాం".

"అవన్నీ నాకు అనవసరం. నేను బయలుదేరి వెళ్ళిపోతున్నాను. నువ్వు వస్తేరా! నీ యిష్టం."

"బాగా ఆలోచించు కోండి. నాన్నగారు, అన్నయ్య చాలా బాధపడతారు."

"నేను చాలా బాధ పడు తున్నాను శ్యామలా, నాకు యీ వూళ్ళో ఏం తోచటం లేదు. ఇంత వయస్సు వచ్చి మనం చిన్న పిల్లల లాగా ప్రవర్తిస్తే బాగుండదు..... .....సరే నేను వెడుతున్నాను."

".....ఉండండి నేనూ వస్తున్నాను. ..... నాన్నా బండి కట్టించండి, మేము మా వూరు వెళ్ళి పోతున్నాం."

"ఇప్పుడు ప్రయాణం ఏమిటమ్మా?"

"ఆయనకు ఇక్కడ ఏం తోచటం లేదట. నేను వచ్చినా రాకపోయినా తను వెళ్ళి పోతారట".

"బావగారితో నేను చెబుతాను శ్యామలా" అని రామం అన్నాడు.

"వద్దురా అన్నయ్యా. ఆయిన మనస్సుని ఎవరూ మార్చలేరు. ఆయన మాటకు విరుద్ధంగా ఎవరైనా ప్రవర్తిస్తే ఆ యింట్లో ఎవరికీ శాంతి వుండదు."

"వెళ్ళనీ రామం! శ్యామలను వెళ్ళనీ" అని వీరభద్రయ్యగారు అన్నారు.

రామం ఏం మాట్లాడ లేదు. కిటికీ లోంచి బయటకు చూస్తున్నాడు.

ప్రక్కయింటి ముత్తైదువు విశాలక్ష్మి గారు వచ్చి శ్యామల కాళ్ళకు పసుపురాశి, క్రొత్త చీరె, జాకెట్టు గుడ్డ యిచ్చింది. అల్లుడికి క్రొత్త బట్టలు వీరభద్రయ్యగారు రామంచేత పెట్టించారు.

పాలేరు పోలయ్య బండి తోలుకుని వచ్చాడు. మాట్లాడకుండా అల్లుడు బండి ఎక్కి కూర్చున్నాడు. రామం కూడా స్టేషను దాకా వస్తానని అన్నాడు. కాని శ్యామల వద్దన్నది. నాన్నగారికి నమస్కరించి శ్యామల బండి ఎక్కి కూర్చుంది. బండి గంటల చప్పుడు అంతకంతకు దూరమై గాలిలో కలిసి పోయాయి. చీకటిలో బండి గంటల చప్పుడు అంతకంతకు దూరమై గాలిలో కలిసి పోయాయి. చీకటిలో బండి మాయమయింది.

"ఇదే జర్మనీలో అయితే, యీ పిచ్చికి మంచి వైద్యం చేసేవాళ్ళు. అతన్ని మామూలు మనిషిని చెయ్యడానికి ప్రయత్నం చేసేవాళ్ళు."

"కాని ఇది భారతదేశం రామం. ఇక్కడి మనుష్యులు తమ తప్పుల్ని అంత తేలికగా ఒప్పుకోలేరు."

దోవ పొడుగునా, నిర్మానుష్యం, నిశ్శబ్దం. మిణుకు మిణుకు మనే, లాంతరు వెలుగులో, డొంకలలో నుంచి వచ్చే కీచురాళ్ళ మోతలు.

బండిలో ముగ్గురు మనస్సుల్లో మూడు అగ్ని పర్వతాలున్నాయి.

"పుట్టింటికి రాగానే అందరినీ మరిచి పోతే ఎల్లా? మొగుడన్న మనిషి ఒకడు ఉన్నాడనే విషయమే గుర్తులేకపోతే ఎల్లా?"

శ్యామల ఏం మాట్లాడ లేదు.

బండి స్టేషనుకు వచ్చేసరికి, రైలు రావటమే కాదు. బయలు దేరడానికి సిద్ధంగా వుంది.

శ్యామల భర్త చక చకా వెళ్ళి రెండు

టికెట్లు తీసుక వచ్చాడు. వర్సు శ్యామల చేతిలో పెట్టి, తను కూలివాడి వెంట, పరుగంత త్వరగా వెళ్ళిపోయాడు.

గార్డు యీల వేశాడు. ఆకు పచ్చ దీపం చూపించాడు. ఇంజను బిగ్గరగా కూసింది. రైలు బయలు దేరింది.

"శ్యామలా రా!" అంటూ అతను కేక పెట్టాడు.

డీసెలు యింజెను. రైలు స్పీడు ఎక్కువ అయింది.

"నేను ఎక్కలేను గొలుసులాగండి" అని శ్యామల కేకబెట్టింది.

"డబ్బుందిగా తర్వాతి రైలులో రా" అని శ్యామల భర్త కేకపెట్టాడు.

స్థాణువులాగా శ్యామల నిలబడి పోయింది. రైలు వెళ్ళిపోయింది. ఎర్ర దీపం చీకటిలో కలిసి పోయింది.

రైలుదిగిన జనం అదరా బాదరా వెళ్ళి పోతున్నారు.

"అమ్మగారు!" అంటూ పోలాయి. పిలిచాడు.

"బండి తీసుకుని యింటికి వెళ్ళిపో!"

"మళ్ళీ బండి వచ్చేదాకా వుంటానండి అమ్మగారు."

"అక్కర్లేదు యింటికి వెళ్ళిపో"!

"ఒరేయ్ పోలాయి! అంటూ ఒక మొగ కంఠం వినిపించింది. శ్యామల ఉలిక్కిపడ్డది. కాని, అటు తిరిగి చూడలేదు. అతని వంక చూస్తే తనకు కన్నీరు ఆగదని, తన విక్రృష్టపు గాథ వింటే, అతని మనస్సు యింకొక సారి గాయపడుతుందని తనకు భయం.

"హల్లో శ్యామలా! నాకోసమని యింత రాత్రివేళ స్టేషనుకు వచ్చావా!!"

"అది కాదండి బాబుగారు...."

"పోలాయి!!!"

పోలాయి కంఠం అక్కడితో ఆగి పోయింది."

"బావ సామాన్లు తీసుకువెళ్ళి బండిలో పెట్టు!!"

పోలాయి సామాన్లు తీసుకు వెళ్ళాడు.

"శ్యామలా "!

"బావా!"

"నిన్ను ఎంత కాలానికి చూశాను శ్యామలా!"

"నిన్ను మళ్ళ చూడగలనని ఆశ పోయింది బావా! నిన్ను చూశాను బావా! అదే సంతోషం."

"ఏం జరిగింది శ్యామలా?"

"ఏమీ జరగ లేదు బావా!"

"నువ్వు చాలా మారిపోయావు శ్యామలా!! ఇంటికి వెడదాం. రా. ఇంటి దగ్గర తీరికగా మాట్లాడుకుందాం."

"నేను మా అత్తవారింటికి వెళ్ళి పోతున్నాను."

"ఇప్పుడా?..... మీ ఆయన ఏడి?"

"నువ్వు వచ్చిన ఎక్స్‌ప్రెస్‌లో వెళ్ళి పోయారు."

"ఏమిటి శ్యామలా నువ్వనేది. నాకేం అర్థం కావటం లేదు."

"అందరికీ అందరి బ్రతుకులు గురించి అర్థం కావలసిన పనిలేదు బావా!"

"అందరి విషయం కాదు శ్యామలా నే నంటోంది. నా శ్యామల విషయం నే నడుగు తోంది!"

"ఇంకా నీ శ్యామల! ఎంత పిచ్చివాడివి బావా!!"

శంకరం ఏం మాట్లాడ లేదు. రైలు వెళ్ళిన దిక్కే చూస్తూ నిలబడిపోయాడు.

"ఒక్క మాట అడగనా శ్యామలా?"

"అడగక పోవటమే మంచిది బావా!"

"అడగనులే శ్యామలా. కాని నాది ఒక్క ప్రార్థన. మీ రైలు తెల్లవారు జామున కాని రాదు. అంతవరకూ నన్ను కూడా నీతోబాటు వుండనీ....."

"అల్లాగే బావా!"

పోలాయి బెడ్డింగు తీసుకుని వచ్చి ప్లాట్‌ఫారం మీద పరిచాడు. శ్యామల్నా శంకరం కూర్చున్నారు. బండి విప్పేసి పోలాయి బండిలో పడుకున్నాడు.

నిశీధిలో, నిర్మానుష్యత్వం. నిశ్శబ్దం మనస్సులో నిరాశ, నిర్లిప్తత.

"వ్యవసాయం ఎల్లా వుంది బావా?"

"మన జీవితాల లాగానే వుంది."

"అదేం మాట?

"చూడు శ్యామలా, మనిషన్న వాడి జీవితంలో ఎన్ని సంపదలు వున్నా, ఏదో రవ్వంత లోటు వుంటుంది. వ్యవసాయం కూడా అంతే. ప్రతి సంవత్సరం కూడా వ్యవసాయంలో ఏదో లోపం వుంటుంది. అది తీర్చలేని కొరతే అవుతుంది. దానివల్ల ఆ రవ్వంత సేపూ తీరని వ్యథ....."

"వేదాంతంలో పడి పోతున్నావు!"

"జీవితంలోని నగ్న సత్యం వేదాంతమే శ్యామలా"

"వెన్నెలరాత్రివూట బావా మరదళ్ళు,



# ఔటర్ సిగ్నల్

ఒకే పక్కమీద కూర్చుని, వేదాంతం గురించి మాట్లాడటం ఆశ్చర్యంగాలేదూ!"

"నిజం మాట్లాడితే బాధ కలిగేటప్పుడు వేదాంతం మాట్లాడటమే మేలు."

"ఏమిటో ఆ బాధ కలిగించే నిజం?"

"మన జీవితాలలోని నిజాలే."

"అంటే?"

"నువ్వు సుఖ పడటం లేదని మా అందరికీ తెలుసు శ్యామలా. దానికి పరిష్కారం ఆలోచించడానికి మా అందరికీ భయమే."

"బావా!"

"పండగకు వచ్చిన దానివి, రేపు పండగ అనగా యీ రోజున అర్ధరాత్రివేళ, మీ వూరు వెళ్ళిపోవడానికి స్టేషనుకు, మా ఆయనతో కలిసి వచ్చావు. అతను ముందు ట్రైనులో వెళ్ళిపోయాడు. నువ్వేమో చలిలో స్టేషనులో నిలబడి వున్నావు. నేనే యీ రైలులో రాక పోతే ఏం జరిగి వుండేదో! ఇవన్నీ సుఖపడటానికి నిదర్శనాలే అంటావా శ్యామలా?"

"నన్నేం చెయ్య మంటావు బావా?"

"నిన్ను గడ్డి పరక కంటే హీనంగా చూసే మనిషిని చూసి, అంత భయపడటం మానెయ్యి, నీ వ్యక్తిత్వాన్ని నిరూపించుకో."

"ఎలా?"

"పెద్ద వాళ్ళు చేసిన అన్యాయాలకు, నీ జీవితం నాశనం చేసుకోవలసిన అవసరం లేదు శ్యామలా"

"ఏం చెయ్య మంటావు బావా?"

"మళ్ళీ పెళ్ళి చేసుకో."

"బావా!!"

"అవును శ్యామలా."

"ఇహ ఆపేసెయి బావా! నీకు అనవసరమైన విషయాలలో జోక్యం కలిగించుకోవటం మానేయి. నేను సుఖంగానే వున్నాను" శ్యామల యింకేం మాట్లాడలేదు. ముఖం అటుప్రక్కకు తిప్పుకుని పడుకుంది. శంకరం కూడా ఏం మాట్లాడలేదు. మనస్సు ఎంతో బాధగా వుంది.

ఇంటి దగ్గర నుంచి బయలుదేరివస్తూంటే అమ్మ ఒకటే మాట అన్నది.

"అభిమానం లేని వాళ్ళని, ఎవ్వరూ గౌరవించరు శంకరం."

అమ్మ మాటని ఎన్నడూ ఎదిరించని తను యీనాడు ఎదిరించాడు. నిజంగా యీ ధైర్యం అనాడే వుండి వుంటె శ్యామల బ్రతుకు యిల్లా అయ్యేది కాదు, తమ యిద్దరి జీవితాలు యిల్లా వ్యర్థం అయి వుండేవి కాదు. శ్యామల తనది అయ్యేది.

ఏం లాభం! ఇది గతజల సేతుబంధనం. ఇది కరిగి పోయిన కల! ఇది కలలోని గాలి మేడ!

ఎవ్వరూ విడదీయలేని చిక్కు ప్రశ్న.

మనస్సులోని వ్యధను మరిపిస్తూ శరీరంలోని బడలిక ఎప్పుడు నిద్దర తెప్పించిందో తెలియదు కాని, రైలు కూత విని ఉలిక్కిపడి లేచే. ప్రక్కన శ్యామల లేదు.

"పోలాయి!!" అని కేక పెట్టాడు.

"అమ్మగారు ఏరిరా?" అని అడిగాడు.

"అమ్మగారు" అంటూ ఏడుస్తూ వాడు రైలు పట్టాల వెంబడి పరుగెత్తాడు.

దిండు దగ్గర మడత పెట్టిన కాగితం కనిపించింది.

బావా!

నేను వెళ్ళిపోతున్నాను. ఎక్కడికి వెడుతున్నానో నాకు తెలియదు. నాకు తెలిసినదల్లా ఒక్కటే విషయం. విధి నాతో చెలగాటం ఆడింది. నేను వెళ్ళవలసిన చోట నాకు ఆదరణ లేదు. నాకు ఆదరణ వున్న చోటుకు నేను వెళ్ళలేను. అదే నా జీవితంలోని ఘోరమైన వ్యంగ్యం. అదే అంతులేని పరాజయం. చెడిపోయిన అవుటర్ సిగ్నల్ దగ్గర ఆగిపోయిన రైలు బండి నా బ్రతుకు. ఆ సిగ్నల్‌ని ఎవ్వరూ యీ జన్మలో బాగు చెయ్యలేరు. శలవు బావా! శలవు.

శ్యామల

"బాబుగారు శ్యామలమ్మగారు అవుటర్ సిగ్నల్ దగ్గర...." అంటూ పెద్దపెట్టున ఏడుస్తూ పోలాయి వస్తున్నాడు. ●

## కమ్యూనిస్టు చైనాలో నా అనుభవాలు

వంటి పొరపాటు చెయ్యరాదనేట్లు బాధ పడవలసి వచ్చింది! అభ్యంతరం చూపించిన వారి లాగూలని మోకాళ్లదాకా చించేశారు.

ఒక క్షవరశాల అధిపతి 'హాంకాంగ్ క్రాప్' అని పేరు పెట్టి ఎన్నోరకాలుగా చేసేవాడు. పొట్టిగా ఉండనంత సేపూ ఏదయినా 'హాంకాంగ్ క్రాప్' అయ్యేది. కాని ఒక ఉదయం 'తొమ్మిదవ కాంటన్ పాఠశాల' పిల్లలు వచ్చి అతని అంగడి కిటికీల మీద పోస్టర్లు అతికించారు, (పొడుగాటి క్రాప్‌లని ఖండిస్తూ). క్షవర శాల అధిపతి, ఇక లాభంలేదనుకుని, అంగడి మూసేశాడు.

వీధుల పేర్లు మార్చేస్తున్నారు, బస్సుల్లో, రయిళ్లలో వెళ్లేవారికి మావో రచనలు చదివి వినిపిస్తున్నారు ఎర్ర రక్షకులు.

ప్రస్తుతం చైనాలోని పాఠశాలలలో, కళాశాలలలో పాఠాలు చెప్పటం ఆపేశారు. విద్యార్థులు రోడ్ల మీద విప్లవభావాలని ప్రచారం చేస్తూవుంటే వారికి చదువుకునే తీరిక ఏదీ?

నేను కాంటన్ వదిలి వెళ్లేముందు ఒక కాథలిక్ చర్చిని చూసి వెడతామనుకున్నాము. ఆ చర్చి గేటు సమీపించామో లేదో కొందరు అబ్బాయిలు లోపల నుంచి బయటికి వచ్చారు. వాళ్ల చేతుల్లో కర్రలు వగయిరాలు ఉన్నాయి. లోపల విగ్రహాలని, ఇతర పూజాసామగ్రిని ధ్వంసంచేసి వస్తున్నారన్న మాట. మేము వారిని నివారించటానికి వచ్చామనుకుని మమ్మల్ని దడిపించటం ప్రారంభించారు. వీరితో వాదించి సాధించేదేమిటని కారులోకి పలాయనం చిత్తగించాను. కాని, ఆ గుంపులో నుంచి బండి ముందుకు సాగేది ఎలా? ఆ ముఠా వాయి కూడి అనుమానాలని తీర్చి, మేము ఫోటోలు ఏవీ తియ్యలేదని చెప్పితప్పించుకున్నాము చివరికి!

(సశేషం)

# సుప్రభాతం

(సీరియల్)

రంగనాథ్

## 2

ఆమెమాటలలో ఉన్నగంభీరత, సత్యమూర్తిలో ఒకవిధమైన అశాంతిరేపింది. తనకేదికావాలో, స్పష్టంగా తనే తెలుసుకోని స్థితిలో వున్నాడు. ఉమయందు విముఖత్వం కలుగడానికి కారణం, ఆమె తన అభిప్రాయాన్ని స్పష్టం చెయ్యడమే. తద్వారా అతను ఉమ ప్రేమకు చాలా తక్కువ విలువ కట్టాడు. అది ఒక పరిపుర్ణయువ్వనయగు స్త్రీ యొక్క సహజమైన కోరిక కావచ్చునని అతనికి తోచలేదు. ఏమైనా అప్పట్లో అతను ఉమకివ్వగలిగిన జబాబల్లా అనంగీకారమేను.

తిరిగి వచ్చిన అనంతరావుగారితో కొద్దిసేపు మాట్లాడి బయటకు వచ్చేశాడు సత్యమూర్తి. ఇక తను కలుసుకోవలసిన వ్యక్తి రామదాసు. ఆయన సాధారణంగా దొరకడం చాలా కష్టం. పేరుకు మాత్రం ఆయన నివాసమని చెప్పదగిన గది ఒకటుంది. కాని అది ఎప్పుడూ తాళం వేసే వుంటుంది. ఆయన ఒక విచిత్ర వ్యక్తి. ఆయన ఏంచేస్తాడో ఎవరికీ తెలియదు. ఆయన కెవరూ స్నేహితులున్నట్లు కనిపించరు. సత్యమూర్తి ఎన్నో సారులు ఆయనను కలుసుకోవడానికివెళ్ళి రూము తాళంవేసి వుండడంవల్ల తిరిగి వెళ్ళిపోయాడు. ఆయన గురించి సత్యమూర్తికి తెలిసిందల్లా, ఆయనొక పరమ వేదాంతి అనీ, ఆయనకూ తనతండ్రికీ కొద్ది పరిచయమేర్పడి అదొక స్నేహంగా మారిందనీ, తమ ఇంటికి ఆయన అప్పుడప్పుడు వస్తూన్నప్పుడు తనను చూచి తనమీద వాత్సల్యం పెంచుకున్నారనీ, ఆ అభిమానమే సత్యమూర్తికీ రామదాసుకీ మధ్య ఒక బంధమైంది.

ఆయనరూముకు తాళంవేసి వుంటుందేమో నని భయపడ్తూ వచ్చిన సత్యమూర్తికి ఆయనరూము తెరిచి వుండడమేగాక రూములోంచి బయటకు వస్తున్న డాక్టరు గురుమూర్తిగారు కన్పించారు. ఆయనను చూసి సత్యమూర్తి కంగారుగా, "ఏంజరిగింది?" అని అడిగాడు. రోడ్డుమీద..

"దెబ్బబాగానే తగిలింది. కానిభయం లేదు. ఆయన చాలా మొండిఘటం. మరొకరైతే చాలాగాభరాపడి పోయేవారు. ఆయన తనరూముకు వచ్చి, నాకు కబురు పెట్టి, నేను వచ్చిడ్రెస్సింగు చేసేదాకా అలారక్తం కారిపోతూంటే పూరుకున్నారు. రాత్రి కొంచెం జ్వరం రావచ్చు. అంతకన్నా ప్రమాదమేమీలేదు." అని డాక్టరుగారు, వెళ్ళిపోయారు. రామదాసుగారికి గాయమైందన్నమాట!

సత్యమూర్తి ఆత్రుతతో ఆయన గదిలోకి వెళ్ళాడు.

* * *

ఆయన వయస్సు ఏభై దాటివుంటుంది. ఒకప్పుడు వస్తాదులాంటి శరీరం ఇప్పుడు చాలావరకూ వడలి, వన్నె తగ్గినా పుష్టిగానే వుంది. ఎప్పుడూ ఖద్దరులాల్చి ఖద్దరు లుంగీ కడ్తారు. తలమీదవెంట్రుకలు చాలా పొట్టిగా వుంటాయి. కళ్ళు నుదురూ చిన్నవి. మాట చాలా సాత్వికంగానే వుంటుంది. కాని ఆళ్ళమైనా మొహం మైనా చూసే వాళ్ళకు, ఒకొక్కక్షణంలో అణగారిన అగ్ని పర్వతాలూ, గోడనుప్రేళ్ళడుతూ ఏఘడియలోనైనా మారణ గోళాన్ని వెడలగ్రక్కే తుపాకులూ, కన్పిస్తాయి. అతని భూత చరిత్రగురించి ఆసక్తిచూపించి లాభంలేదని చాలామందికి తెలిసింది. సాధారణంగా ఆయనకు పరిచయస్తులు గాని స్నేహితుళ్ళుగానీ వున్నట్లు కన్పించదు. ఆయనగురించి ఎవరికీ తెలియదు. సత్యమూర్తికి తెలిసిందికూడా చాలా తక్కువ. తనతండ్రికీ ఆయనకూ స్నేహం ఎలా కలిసిందో, ఆయనకు తనమీద గల వాత్సల్యానికి కారణమేమిటోసరిగ్గా తెలియదు.

మంచంమీద పడుకొని విశ్రాంతి తీసుకోవలసిన రామదాసుగారు గదిలో ఇటూ అటూ పచారుచెయ్యడం, భుజంవద్ద పెద్ద కట్టూ ఒకచెయ్యి పైకిలాగి కట్టిన కట్టుతో తిరుగుతున్న ఆయనను చూడగానే అడవిలో, దెబ్బతిని పౌరుషంతో రోజుతున్న పెద్దపులి జ్ఞాపకమొచ్చింది. సత్యమూర్తికి. సత్యమూర్తిని చూడగానే ఆయన , ఆత్రుతగా, "రావోయ్. నీకోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు.

"మీకేదో గాయంతగిలిందని డాక్టరుగారు చెప్పారు. ఎలా తగిలింది. అయినా అంత పెద్దకట్టుతో, అలా తిరుగుతారేమిటి? విశ్రాంతి తీసుకోకపోతే మరింత బాధకదూ. మంచంమీద కూర్చోండి. నేను కాఫీతయారుచేస్తాను" అన్నాడు సత్యమూర్తి. అప్పటికి రాత్రి ఏడుగంటలు దాటి వుండడం, ఆయన గదిలో రోజూ కన్పించే వంట ప్రయత్నం కనిపించక పోవడంతో, ఏంచెయ్యాలోతోచక.

"అలాగే కాఫీచేద్దువుగాని, నువ్వు నా గాయంగురించి ఏమీదిగులు పడకు. నీతో ఇవాళ కొన్ని విషయాలు మాట్లాడాలి. నువ్వురాకపోతే, నీకోసంనేనే రావలసివచ్చేది ఆవిషయాలు చెప్పడానికి. నువ్వురావడంతో నాదిగులు చాలా వరకూ తీరింది." అని మెల్లగా మంచం మీద కూర్చున్నారు. సత్యమూర్తి స్టౌ వెలిగించి కాఫీకి నీళ్ళు పెట్టాడు. రామదాసుగారు కొద్ది కొద్దిగా ప్రారంభమవుతున్న బాధనుఅణచుకుంటూ "చాలా కాలంనుండి నీతో చెప్పదల్చుకున్నా






ఇంకా తగిన సమయం రాలేదని వాయిదా వేస్తూ, ఇన్నాళ్ళనుంచీ చెప్పలేదు.''

''అసలు ఈగాయం ఎలా తగిలిందో చెప్పండి.''

''గాయానికి వెనక గాథ చాలావుంది. అంతా తరువాత చెప్తాను. మొదట ముఖ్యంగా చెప్పవలసిందొక విషయం వుంది. నేను ఇంకా కొంతకాలం జీవించచ్చు. లేకపోతే ఈజీవిత రంగంమీదనుండి వెంటనే అదృశ్యం కావచ్చు. ఏది ఎలా జరిగినా నాకోరిక ఒకటుంది. నేను, ఏకారణంవల్లనైనా మరణిస్తే, ఆకోరికను నెరవేర్చే బాధ్యత నీమీద ఉంచుతున్నాను.''

తనవైపు జాలిగా చూస్తున్న రామదాసు గారివైపూ ఆయన కట్టువైపూ ఒక్కసారి చూశాడు సత్యమూర్తి. తరువాత, ''చెప్పండి తప్పకుండా నెరవేరుస్తాను.'' అన్నాడు.

''ఏమీలేదు నాకొక కూతురుందన్న సంగతి ఇన్నాళ్ళూనీకు తెలియదు. ఆమె భవిష్యత్తుగురించే నా బెంగ. ఒకవేళ నాకే దైనా ఆపదవస్తే ఆమె బాధ్యతను నువ్వు స్వీకరించాలి.'' అని మెల్లిగా చెప్పారు.

''ఆవిషయం మీరేమీ సందేహించ కండి. మీరు కోరినట్లు చేస్తాను. కాని మీరు మీ భవిష్యత్తు గురించి అంత నిరాశగా ఎందుకంటున్నారో తెలియటం లేదు.'' అన్నాడు. కాఫీ కలుపుతూ.

''నా జీవిత చరిత్ర అంతా చెప్తాను. అప్పుడు నువ్వే గ్రహిస్తావ్. రేపే నేను నాపేరనున్న కొద్ది ఆస్తినీ నా కూతురి పేర వ్రాయించి ఆమెకు నిన్ను గార్డియన్ గావేస్తాను. ఆమె కిప్పుడు వయసు, పదిహేడు. పి. యూ. సి. చదువుతోంది. అదయ్యాక ఆమెకు బి. ఏ. చెప్పించాలని నాకోరిక. నా దగ్గర కొంత చరాస్తి వుంది. అది సుమారు పదివేల రూపాయలు ఖరీదు చేస్తుంది. ఆమె చదువూ వివాహం, ఆడబ్బుతో పూర్తవుతాయని నమ్మకముంది. మళ్ళీ ఏదెలా వస్తుందో, ఆమూలగోడదగ్గర ఒక నాపరాయి వుంది. అది పెల్లగిస్తే ఒక చిన్న గొయ్యి కన్పిస్తుంది. ఆ గోతిలో ఒక చిన్న పెట్టె వుంది. ఆ పెట్టెలో వున్న వెండి బంగారు వస్తువు అమ్మితే ఆడబ్బు సమకూడుతుంది.'' అని గోడవద్దకు వెళ్ళి నాపరాయిని చూపించాడు సత్యమూర్తికి, రామదాసుగారు.

కాఫీ నిద్దరూ త్రాగుతూంటే, సత్యమూర్తి ఆయన మొహంవైపు చూస్తూ, ''మీకుబాధ ఎక్కువవుతున్నట్లుంది.విశ్రాంతి తీసుకోండి. తక్కిన విషయాలు రేపు చెప్దురుగాని.'' అన్నాడు.

''అబ్బే బాధ నాకొక లెక్కలోనిది కాదు. ఈవాళ నాహృదయమంతా నీముందు విప్పి చెప్పుకోవాలనిపిస్తోంది. ఇవాళ మనిద్దరం ఇలా కలుసుగోగలగడం కూడా దైవఘటనే. సాయంకాలం నన్ను అంతమొందించాలనే ప్రయత్నించారు. కాని వాళ్ళకు చిక్కకుండా ఈ గాయంతో బయటపడ్డాను. ఈ విషయాలన్నీ నీతో చెప్పాక, నాకూతురు బాధ్యత నీమీద పుంచాక, ఇహ నాకేం జరిగినా బాధ లేదు. అందువలన నాకు బాధనిపించటం లేదు.''

''అసలీ గాయాలు ఎలా తగిలాయి?''

''ఆవిషయానికిముందు చెప్పవలసిన గాథ

# సుప్రభాతం

చాలా వుంది.'' అని కొద్దిసేపు ఆగి, తన గాయంవైపు ఒకసారి చూసుకున్నారు. అది ఆయనను చాలా బాధిస్తోందనీ, కాని మొండిగా సహిస్తున్నారనీ సత్యమూర్తి గ్రహించాడు. అతను నిశ్చలంగా ఆయన వైపు చూశాడు.

''నేను పుట్టినది ఒక ప్రఖ్యాత సంగీత కళాకారుల వంశంలో. మా నాయనగారు అఖండ విద్వాంసులు. ఆయన అనేకమంది శిష్యుల్ని తయారు చేశారు. మాయింట్లో నిరంతరం సంగీత ఘోష సాగుతూనే వుండేది. మేము ముగ్గురన్నదమ్ములం, ఇద్దరు చెల్లెళ్ళూ. నాకు సంగీతం వినికిడి వలననే వచ్చింది. అతి బాల్యంనుండే నేను పాటకచ్చేరీలు చెయ్యడం ప్రారంభించాను. నేను పాడగా విన్నవారందరూ నాకు జోహారు లర్పించే వారు. నాపాట విని మా నాయనగారుకూడా చాలా సంతోషించే వారు. నేనొక గొప్పవిద్వాంసుడనై దేశమంతా తిరిగి ఘన సన్మానాలు పొంది ఆయనకు కీర్తి తెస్తానని కలలు కనేవారు. తదనుకూలంగా పద్నాలుగు సంవత్సరాల వయసులో నేను మైసూర్ మహారాజావారి సన్మానం పొందాను. ఆనాడు మా నాయనగారు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు. ఆంధ్రదేశమంతా నా పేరు మార్మోగింది. చెన్నపట్టణంలోని దాక్షిణాత్యులంతా మెచ్చుకున్నారు. నాకది తెలిసీ తెలియని వయస్సు. అందరియొక్క పొగడ్తలలో నాకు విశేషమేమీ కన్పించేదికాదు. అది నాకు సహజంగా రావలసిన ప్రఖ్యాతి అనీ, ఎల్లకాలం నాకాఖ్యాతి నిలువడమే కాకుండా, నా కీర్తి నలుదిశలా వ్యాపిస్తుందనీ, అదంతా సాధారణ విషయమనీ అనుకునే వాణ్ణి'' అని ఆయన కొద్ది నిముషాలు బాధతో కళ్ళు మూసుకుంటూ ఆగారు. ఇది వింటూ ఆశ్చర్యంలో మునిగిన సత్యమూర్తి, ''అబ్బా! మీరంత సంగీత విద్వాంసులని నాకు తెలియదుసుమండీ' 'అన్నాడు.

దానికాయన, ''ఈ విషయం సుమారు నలభై ఏండ్ల క్రిందటిది. అప్పటికి ఇప్పటికీ ఎంతో మార్పు వచ్చింది. అందువల నాసంగతి ఎవరికీ తెలియడం నాకిష్టం వుండదు. ఈ విషయం నీకెందుకు చెప్తున్నానంటే, ఏ విద్య నన్నంత ఉచ్ఛస్థితిలోకి తీసుకు వెళ్ళిందో, అదేవిద్య నాకనేక ఆపదలు తెచ్చిపెట్టింది. ముఖ్యంగా ఇతరులను అంతగా రంజింపజేసేకళ, కళాకారుని దుర్భర ఆవేదనకు మూలకారణం కూడా కాగలదు. కళను విడువలేక, ఆ కళను సృష్టించిన తన హృదయం కల్పించే సమస్యల నెదుర్కొనలేక, కళాకారుడు చాలా బాధపడతాడు. 'కళాహృదయమనేది ఒక అపూర్వ వరము కావచ్చు, లేక దారుణ శాపమూ కావచ్చు. నా చిన్నతనంలోనే లభించిన కీర్తి నన్ను కొన్ని వక్రమార్గములు పట్టించక పోలేదు. స్త్రీలు నాయందు చూపించే ఆసక్తి, నన్నొక స్త్రీలోలుడుగా మార్చింది. ఒకటి రెండు సార్లు నా ప్రవర్తన మా నాన్నగారికి తెలియడం, ఆయన నన్ను చీవాట్లు వెయ్యడం జరిగింది. ఆరోజుల్లో నాది చాలా ఉద్రేకతత్వం. అసలే పెద్దఖ్యాతి, నలుగురిలోనూ గౌరవం, స్త్రీజన హృదయాల్ని ఆకర్షించడం మొదలైనవి, నా విచక్షణా జ్ఞానాన్ని క్షీణింప జేసేయి. దానికితోడు దుస్సాహసం కూడా వుండడం వలన ఎవరు నన్నేమన్నా, కోపంతో మండిపడిపోయే వాణ్ణి. మా నాన్నగారు నన్ను మందలించినందుకు ఆయన మీదకు తిరగబడేవాణ్ణి. కాని ఆయనే నా గురువు అవడం వల నా ఉద్రేకాన్ని నాలోనే అణచుకున్నాను. త్వరలోనే ఆయననుండి వేరుపడాలని నిశ్చయించాను. ఆయన కూడా నా వివాహం జరిపించి, నన్ను దక్షిణదేశం పంపిద్దామని నిశ్చయించారు. ఇంతలో నా జీవితంలోని మొదటి మలుపు ఎదురైంది''.

''ఆరోజుల్లో గాంధిజీ స్వాతంత్ర్య సమర శంఖారవం ప్రయోగించారు. అది హృదయమున్న ప్రతి భారతీయుడినీ కదిల్చివేసింది. నాలోని జాతీయాభిమానం పెకిపొంగింది. వెంటనే సత్యాగ్రహంలో పాల్గొన్నాను. అదొక మహత్తర అనుభవం. దేశంకోసం తన సర్వస్వాన్నీ త్యాగంచేసి ఎంతటి దారుణ కష్టాలనైనా ఎదుర్కొనగల హృదయౌన్నత్యం ఆ మానవులందరిలోనూ కన్పించింది. ఆ మహాత్యాగులతో నేనుకూడా జైల్లో వుండడం అదృష్టంగా భావించాను. పదిసంవత్సరాలు నా జీవితం జైళ్లలో గడిచి పోయింది. అది ఒక అద్భుతమైన కార్యంలా భావించాను. నాజీవితం ధన్యమైంది అనుకున్నాను. నేను జైలునుండి

విడుదలై ఇంటికి వెళ్ళే సరికి మా పరిస్థితులన్నీ తారుమారై పోయాయి. మా నాన్నగారు చనిపోయారు. మా ఆస్తంతా పోయింది. ఆయన బ్రతికున్నంత కాలం ఇల్లు రాజభోగంగా నడిచేది. కాని ఆయన చనిపోగానే మా నిజస్థితి బయట పడింది. సంగీతం దేశంలో వ్యాపింపజెయ్యాలనే ఉత్సాహంతో ఆయన, శిష్యులను పోషించడానికి తన ఆస్తినంతా వెచ్చించేశారు. ఆయన చనిపోయేటప్పటికి మిగిలిందల్లా, అప్పులు, కుటుంబంలో దారిద్ర్యం.'' అని కొద్ది నిముషాలు ఆగారు. ఆయన చరిత్ర ఆసక్తితో వింటున్న సత్యమూర్తి, ''మిగిలినది రేపు చెప్పరుగాని, మీరు ఆ గాయం బాధతోనే కష్టపడుతున్నారు. విశ్రాంతి లేకుండా ఈ విషయాల గురించి జ్ఞాపకం తెచ్చు కోవడ మెందుకు?'' అన్నాడు. ఆయన రెండునిముషాలు కళ్ళుమూసి మళ్ళీతెరచారు.

''నీతో మాట్లాడుతూంటే, ఈ బాధను నేను మర్చి పోగలుగుతున్నాను. నేను జైలు నుంచి తిరిగి వచ్చాక యధార్థ విషయాలు చాలా తెలుసుకున్నాను. అంత వరకూ ఇంటికి తిరిగి రావటం అంటే ఎంతోఉత్సాహంగా ఉన్న నాకు నా యొక్క కుటుంబంయొక్క యధార్థస్థితి చాలా నిస్పృహ కలిగింది. మా అన్నయ్య, మా ముగ్గురిలో పెద్దవాడు చాలాకష్టం మీద సంసారం గడుపుకు వస్తున్నాడు. ఫిడేలు వాయిద్యంలో గొప్ప ప్రతిభ కలవాడు ఉత్తర హిందూస్థానం వెళ్ళిపోయాడు. ఈబాధలు భరించలేక. ఇప్పటికీ వాడిసంగతి నాకు తెలియదు. ధనసంపాదన చేస్తేనే కాని, నాకూ సంసారానికీగడిచేటట్లు లేదు. అందువలన నేను డబ్బుసంపాదించాలి. అది చాలా సులభం అనుకున్న నాకు వెంటనే అది ఎంత కష్టమో తెలిసింది. ప్రజలలో అభిరుచి మారడం వలననో రాజపోషణ లేక పోవడం వలననో, సులభ సంగీతం పైన ఆకర్షణ జనులలో పెరగడం వలననో, మరేకారణం చేతనో కర్ణాటక సంగీతం ద్వారా ధనసంపాదన చాలా దుర్లభం అని తెలుసుకున్నాను. కచేరీలు చేస్తే విని ఆనందించి ఆదరించేవారు కరువయ్యారు. ప్రజలకు రికార్డులూ రేడియో, సినిమా సంగీతాల మీదవున్న మోజు సంగీత విద్వాంసుడి మీదలేదు. త్యాగరాజు మనవాడని గొప్పచెప్పుకోవడమే గాని, ఆయన దివ్యస్మృతిని, అద్భుతమైన ఆయన సంప్రదాయాన్ని కాపాడుకోసం శక్తి మనలో లేకపోయింది. ఆఖ్యాతి దాక్షిణాత్యులకు దక్కింది. చివరకుకొన్ని ఇళ్లలో పాఠాలు చెప్పుకుంటేనే గాని నాకు తిండికే గడవడం కష్టమైంది' అలాగే ఆంధ్ర దేశమంతా తిరిగాను...... అబ్బ!'' అని ఆయన మెల్లగా మూలిగారు. ఒకనిముషం వుండి కొద్దిగా మంచినీళ్లు త్రాగారు. సత్యమూర్తి ఆయనను మాట్లాడవద్దనలేకా, ఆయన బాధచూడలేకా, ఏం చెయ్యాలో తెలియక తనలో తను మథన పడుతూంటే ఆయనమళ్ళీ మొదలెట్టారు.

''ఒక ఊరిలో జమీందారిగారింట్లో వారమ్మాయికి పాఠం చెప్పడానికి ప్రత్యేకంగా నాకన్నిసౌకర్యాలూ ఏర్పాటుచేసి నన్ను పిలిపించిచారు. నేనొక సంవత్సరం ఆ ఊళ్ళో గడిపాను. ఆ అమ్మాయి నన్ను ప్రేమించింది. మావివాహం ఆమెతండ్రి అంగీకరిస్తాడని నమ్మకంలేదు. అందువలన ఇద్దరం ఎక్కడికైనా పారిపోదామని నిశ్చయించాం. ఇంతలో ఆమె గర్భంధరించింది. ఆమెతండ్రికి అన్ని విషయాలూ తెలిసి నన్ను అక్కడనుంచి వెళ్ళిపొమ్మన్నారు. నేనామెను వివాహం చేసుకుంటానన్నాను. ఆయన అంగీకరించలేదు. ఏమైనా ఆమె నాభార్య అని నిశ్చయించుకున్నాను. మమ్మిద్దరినీ కలియనీయ్యకుండా ఒక సంవత్సరం చాలా జాగ్రత్తలు తీసుకున్నారు. కాని ఆమెమాత్రం కొందరి ద్వారా తన యోగక్షేమ సమాచారాలు నాకందజేస్తూండేది. జమీందారుగారు నన్ను రహస్యంగా అంతమొందించమని కొందర్ని నియోగించారు. కానీ చిన్నప్పటినుండి సంగీతంతో పాటు కత్తిసాము, కుస్తీలలో ఆరితేరి వుండడం వలన నాలుగైదుసార్లు, నామీదపోట్లాట నెపంతో వచ్చిన ఆయన అనుచరులకు గట్టి బుద్ధిచెప్పి పంపాను. వారిలో ఒకడు చాలా దుర్మార్గుడు; అఖండమైన తెలివి తేటలు గలవాడు. ఆమెను ప్రేమించినవాడున్నాడు. వాడు నామీద తన తెలివినంతా ఉపయోగించాడు. కాని నన్ను భగవంతుడు కాపాడాడు. అప్పటినుండి వాడు నామీద కక్ష గట్టాడు. ఆమెను నాకు కాకుండా చెయ్యాలని ఎంతో ప్రయత్నించాడు. కాని చివరకు ఆమె నాదగ్గరకు వచ్చేసింది. అప్పటికి ఆమె మగ శిశువును కంది. ఆ శిశువును వాళ్ళేంచేశారో ఆమెకు తెలియదు. రహస్యంగా చంపేశారనుకుంది. రెండు నెలల బాలింతరాలు నావద్దకు ఒక అర్ధరాత్రి రహస్యంగా వచ్చేసింది. వెంటనే మేము ఉత్తర హిందుస్థానం వెళ్ళిపోయాం. ఇది పాతికేళ్ళ క్రిందటి మాట. పదేళ్ళపాటు దేశమంతా తిరిగాము. మమ్మల్ని వెదకాలని వాళ్ళుచేసి ప్రయత్నమంతా వ్యర్థమయి వాళ్ళు నిరాశ చెందారు. ఆసమయంలో మాకొక ఆడపిల్ల కలిగింది. ఆమెకు ఆరు నెలలప్పుడు ఈవూరు వచ్చాము. అప్పుడు హఠాత్తుగా నాభార్య చనిపోయింది. ఆపిల్లను నేను పెంచలేక అవస్థపడుతూంటే ఒక బీద దంపతులు ఆమెను పెంచుతామంటేవాళ్ళకిచ్చాను. వారికి బిడ్డలు లేరు, నేను ప్రతినెలా వారికి కొంతడబ్బు పంపిస్తూ వచ్చాను. చాలా వూళ్ళు తిరిగి డబ్బుసంపాదించడం ఆరంభించాను. అప్పుడప్పుడు వచ్చి నాకూతుర్ని చూసి పోతూండేవాడిని. సుమారు అయిదు సంవత్సరాల క్రిందట ఈవూరిలో మకాంపెట్టాను. నేనుఒక్కడినే ఒకచిన్న రూము తీసుకొని వుండడానికి గల కారణం నాకూతురు విషయం ఎవరికైనా నాశత్రువులకు తెలిస్తే, నామీద కసికొద్దీ ఆమె క్షేమమునా అపకారం తలపెట్టవచ్చు ననే భయమేను. నేననుకున్నట్లే నిన్న ఈవూళ్ళో నాపరమశత్రువు కన్పించాడు. తత్ఫలితమే ఈ గాయం. నాభార్య పుట్టిల్లు ఇక్కడికెంతో దూరంకాదు. నాశత్రువు సామాన్యుడు కాడు. అతని చేతిలో చాలామంది రవుడీలున్నారు. సాయంకాలం నలుగురు ఒక్కసారి నామీద విరుచుకుపడ్డారు. వాళ్ళకూ గాయాలు బాగా తగిలాయి. నాకూ గాయం తగిలింది. ఇంతలో నన్ను వాళ్ళు వదిలి పెడ్తారని నమ్మకంలేదు. ఏ[illegible] ఏమైనా ఈ కవరులో కాగితాలు చూస్కుంటే నీకు అన్ని విషయాలూ తెలుస్తాయి.'' అని ఒక కవరు అల్మారులోం



తీసి అతని కిచ్చారు. సత్యమూర్తి ఆ కవరు తీసుకున్నాడు.

"నేను మీకోసం ఏదైనా ఆహారం తెస్తాను. మీరు విశ్రమించండి." అని బయల్దేర బోయాడు. రామదాసుగారు. "వద్దు నాయనా. నాకేమీ అక్కరలేదు. నీకు బాగా ఆలస్యమైంది నువ్వింటికి వెళ్ళు". అని మెల్లిగా మంచంమీదికి ఒరిగారు. ఆయన కిక విశ్రాంతి అవసరమని, తను అక్కడ వుండి ఆయనను బాధపెట్టడం భావ్యం కాదని, గ్రహించి సత్యమూర్తి మెల్లిగా ఇంటికి బయల్దేరాడు. రామదాసుగారికి చిన్న కునుకు పట్టిందంటే, సత్యమూర్తి బయటకు వచ్చేశాడు. మళ్ళీ మర్నాడు ప్రొద్దున్నే ఆయనను కలవొచ్చని.

ఇంటికి వెళ్తున్న సత్యమూర్తికి రామదాసుగారి మాటలే జ్ఞాపకం రాసాగాయి. అప్పటికి రాత్రి పదిగంటలైంది. కొన్ని కొన్ని వీధులలో జనసంచారం బాగా తగ్గింది, ఒకవిచిత్రమైన కథనువిని దానిగురించి ఆశ్చర్య పడుతూ నడుస్తున్న సత్యమూర్తికి, అకస్మాత్తుగా ఒక అనుమానం తోచింది. తన నెవరైనా అనుసరిస్తున్నారేమో?— అని ఎందుకంటే ఒకనల్లటి సన్నని వ్యక్తి. తన వెనకాల కొద్దిదూరంలో, చాలాదూరం నుంచీ నడుస్తున్నాడు. వాడిజుత్తు చాలా పెద్దది. వెయ్యడమైతే పాంటూ, చొక్కా వేశాడుగాని, మొహంలో నాగరికత ఎక్కడా లేదు. పీక్కుపోయిన కళ్ళూ, తూలుతూ నడకా తాగుబోతులా వున్నాడువాడు. సత్యమూర్తిని చాలా దూరం అనుసరించి సత్యమూర్తి తన ఇంటి సందు ప్రవేశించగానే మాయమయ్యాడు.

ఇంటికి వెళ్ళేసరికి, తల్లీ, చెల్లెలూ నిద్రబోతున్నారు. తల్లిని లేపితే ఆమెలేచి అతనికి వడ్డన ప్రయత్నం ప్రారంభించింది.

# సుప్రభాతం

కాళ్ళూ చేతులూ కడుక్కొని, భోజనానికి ఉపక్రమించాడు, సత్యమూర్తి. తల్లి "ఇంత ఆలస్యమయిందేం?" అని అడిగింది.

"రామదాసుగారితో మాట్లాడుతున్నాను, ఇంతసేపు. అనంతరావుగార్ని కూడా కలుసు కున్నాను."

"బాకీలగురించి మాట్లాడేవా?"

"ఆ. అనంతరావుగారు డబ్బిస్తానన్నారు. దానితో చిల్లర బాకీలు తీర్చేద్దాం. పెద్ద బాకీల సంగతి తరువాత చూసుకుందాం. చెల్లాయి భోంచేసి పడుకుందా?"

"ఆ. దానికి రామవరం వెళ్ళడం ఇష్టంలేదు. మనిద్దరం ఇక్కడే వుందాం, అన్నయ్య నొక్కడిని వెళ్ళమను అంటూంది."

"అదెలా కుదురుతుంది. రెండు కాపరాలయితే నా ఆదాయం ఏం సరిపోతుంది. అయినా పట్నవాసంలో వున్నంత ఖర్చు తగ్గి, బాకీలు తీర్చే అవకాశం కూడా వుంటుంది. ఇక్కడ ఇన్ని అవస్థలు పడడం కన్నా అదేమేలు."

"ఏమిటోరా. రామవరం పేరువిన్న దగ్గర్నుంచీఅది మొహం ముడుచుకు కూర్చుంది. దానికెలాగో నువ్వే నచ్చ చెప్పాలి."

"సరే రేపు దానితో మాట్లాడుతాలే."

ఆరాత్రి రామదాసు గారు చెప్పిన విషయాలగురించి ఆలోచిస్తూ పడుకున్నాడు సత్యమూర్తి. ఆయన గొప్ప సంగీత విద్వాంసుడని ఇంతకాలం తనకు తెలియదు. ఆవిద్య ఆదరణవుంటే ఆయన ఇలా వుండేవారుకారు. ఒకజాతి అభివృద్ధి చెందాలంటే, దాని ఉన్నత సాంప్రదాయాలమీద గౌరవ ముండాలి.ఎవరిలో కాస్త ప్రతిభవున్నా దానికి ప్రోత్సాహ ముండాలి. ఇవి లేనినాడు, ఎంతో ప్రతిభా వంతులు కూడా అణగారిన కుసుమాలై పోతారు. రామదాసుగారిది చాలా గంభీరమైన హృదయం. ఆయన మితభాషి. ఈరోజున ఆయన ఇంతగా మాట్లాడారంటే ఎన్నో బలవత్తరమైన కారణాలుండాలి. లేకపోతే అన్ని విషయాలు చెప్పరు. తనయందాయనకొక ప్రత్యేకమైన అభిమానం వుంది.

మరునాడు ప్రొద్దున్న కొద్దిసేపు ఇంట్లో, చెల్లెలితో రామవరం వెళ్ళడం విషయం చర్చించాక, సత్యమూర్తి రామదాసుగారింటికి బయల్దేరాడు. దారిలో చెల్లెలి వివాహ విషయం గురించే ఆలోచించ సాగాడు. కళ్యాణికి ఇరవై రెండేళ్ళు వచ్చినా తను వివాహం చెయ్యలేక పోతున్నాడు. అది చాలా తెలివైన పిల్ల. కాని ఈవిషయంలో ఎందుకుపట్టుదల పట్టిందో తెలియదు. ప్రకాశం అంటే దానికి ఒకప్పుడు చాలా అభిమానం వుండేది. కాని ఇప్పుడు అతని పేరుచెప్తేనే మండిపడిపోతోంది. ఏమైనా సరే రామవరం వెళ్దామంటుంది. తను గట్టిగా రామవరం వెళడం తప్పదని చెప్పాడు. కళ్యాణి ఏడుపు మొహం పెట్టడం కూడా తను చూశాడు.

ఆలోచిస్తూ, రామదాసుగారిలు వున్నసందులోకి వచ్చిన సత్యమూర్తికి, ఆసందు మొదట్లో వుండంగానే. రామదాసుగారింటి దగ్గ ఏదో గలాభా జరుగుతున్నటు కన్పించింది. పోలీసులుకూడా కన్పించారు. అక్కడ వున్న ఒక సోడా కొట్టతను, "బాబూ" అని సత్యమూర్తిని పిల్చాడు. సత్యమూర్తి కొట్టువద్దకు వెళాడు.

"రాత్రి చాలా ప్రమాదం జరిగిపోయింది సార్." అన్నాడు కొట్టు తాలూక్కు అసామి. అతనికి సత్యమూర్తితో కొంచెం పరిచయముంది.

"ఏమిటైంది?" అని అడిగాడు సత్యమూర్తి.

"రామదాసుగార్ని ఎవరో పొడిచేసి వారు. ఆయన దాసుకున్న దంతా దోచే సారు. ఘోరంగా చంపేశారు."

"ఆ!" అని నిర్ఘాంత పోయాడు సత్యమూర్తి. గుండెలు జారిపోతూంటే, నిలబడలేక అక్కడున్న ఒక బెంచీమీద కూర్చున్నాడు. ఆ అసామిచెప్పుకు పోతూంటే విషయాలన్నీ సత్యమూర్తికి తెలియ సాగాయి.

(సశేషం)



# మీ జుత్తును ఆరోగ్యంగా నిగనిగలాడేలాగు వుంచుతుంది

# బ్రిల్‌క్రీమ్

(సర్వోత్తమ హేర్-డ్రెస్సింగ్)

కేవలం బ్రిల్ క్రీమ్ మాత్రమే

- చక్కగా జుత్తు దువ్వుకోవడానికి సాయపడుతుంది. జుత్తు జిడ్డు కాదు, చెదరి పోదు.
- చాలా పొదుపు అయినది. ఒక్కసారి రాస్తే చాలు రోజంతా జుత్తు రేగదు.
- దీనిలో చేర్చిన అద్వితీయమైన మిశ్రమము మాడును పోషించి, జుత్తును బాగా పెంచుతుంది.
- మీ జుత్తు యొక్క సహజ రంగును బయలు పరచును.

మీరు కూడా బ్రిల్ క్రీమ్ ఉపయోగించడం మొదలు పెట్టండి

ప్రపంచమంతటా లక్షలాది మంది సొగసుకారులు ఉపయోగించేది.



# ఆఫ్రికా ఖండం కళా సంపద

ఎస్. వి. రామారావు



నృత్య పండుగానికై ఇచ్చవాళ్లు వేసుకొనే 'మాస్క్'

కొన్ని కళాసాధనాలు కట్టుబాట్లలోకి కళ కూడా ఒక జాతిని మరొక జాతిని వేరుపరిచి దాని సహజ గుణాలని బయట పెట్టగలదు. ఆఫ్రికాలో కళకి సరి హద్దులు లేవు. ఖండం అంతా ఏకరూపంగా ప్రవహించింది. ఎన్నో ముఠాలుగా విడి పోయి ఉన్న ఆఫ్రికా ప్రజలని దానికి పూస గుచ్చినట్లు కలిపి, తన గొప్పదనాన్ని చూపి మనల్ని విభ్రాంతుల్ని చేస్తోంది. ఆఫ్రికన్ల కళా సృష్టులు వారి నిత్య జీవితంలో భాగాలయి పోయాయి.

ఒకప్పుడు 'అనాగరిక కళ'గా పరిగణింపబడింది, నేడు తన పూర్తి విలువని చాటుకోగలుగుతోంది. రాజకీయ రంగాలలోనేగాక లలితకళారంగాలలోనూ ఆఫ్రికా ప్రాముఖ్యత పెరుగుతోంది.

ఇతర ప్రాంతాలలో, అందులో పాశ్చాత్య దేశంలో, ఆఫ్రికా కళా సాంప్రదాయాలు తమ ప్రభావాన్ని బాగా నిరూపించుకుంటున్నాయి. రూపాలని రూపాలుగా వ్యక్తపరిచే కాక ఆ రూప స్వభావంతో చూచే దృక్పథం ఆఫ్రికన్ కళాసాంప్రదాయాలు నేర్పినవే. పికాసో, మోడిగ్లియానీ, బ్రాంకూసీ మొదలయిన వారి చిత్ర, శిల్ప కళలలో ఆఫ్రికా ప్రభావాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

ఏదయినా అంతర్జాతీయ ప్రాచీన వస్తు ప్రదర్శనశాల, లేక కళావస్తు ప్రదర్శనశాలకి వెడితే పాశ్చాత్యశాఖ, ఇండియన్ శాఖ, ఆఫ్రికన్ శాఖ, దక్షిణ అమెరికా శాఖ అంటూ కనిపిస్తాయి. మొదటిసారి చూసిన వారికి ఆఫ్రికన్



'వేటగాడు' కంచుతో చేసినది



'నైజీరియన్ స్త్రీ తల' ఇత్తడితో చేసినది

శాఖలోని వస్తువులు మోటుగా, అనాగరికంగా ఉన్నాయా అనిపిస్తుంది. కాని, ఈ ఆకారాల వెనుక సాంప్రదాయాలన్నీ భావనలని కొంచెం లోతుగా పరిశీలిస్తే ఎంతో ఆనందం కలుగుతుంది. రకరకం రూపాలు, జనపనార, కొబ్బరిపీచు— వీటితో బ్రహ్మాండమయిన కళాఖండాలని సృష్టిస్తారు ఆఫ్రికన్ కళాకారులు. భయమే కాక హాస్యం కూడా ఉట్టిపడతాయి వారి శిల్పాలలో.

ఘనా, నైజీరియా, కాంగో, న్యాగినీ, దహోమీ వంటి ఆఫ్రికన్ దేశాలు అభివృద్ధి చెందినవి. ఇక్కడి శైలి పద్ధతులు ఆఫ్రికన్ కళా సాంప్రదాయాలకి ప్రాతినిధ్యం వహిస్తాయి. (ఈజిప్టు ఆఫ్రికాలో ఇప్పటికీ దానిని అరబ్బుదేశం కిందే జమ కట్టారు కాబట్టి ఆ దేశం కళని ఎంచి రాయను.)

ఆఫ్రికాశిల్పం మనల్ని అధికంగా ఆకర్షిస్తుంది. అసలు ఈ ఖండంలో (అంటే నల్ల జాతులలో) చిత్రలేఖనానికి అంత ప్రాముఖ్యత రాలేదు. కొన్ని పండుగల సమయాలలో వ్యక్తం రంగు రంగులుగా ఉండే 'కపటముఖాల' (మాస్క్)ని తగిలించుకుంటారు కాని ఆసియా, యూరోపుల చిత్రలేఖన సాంప్రదాయాలతో పోల్చలేము. ఈ కపటముఖాలని చెక్క, ఈకలు, లోహం తయారుచేస్తారు. వీటిని కలిపి చూస్తే మనస్సుకి హత్తుకుపోయేట్టుగా ఉంటాయి.



'పిట్ట' రాతిలో చేసినది

**ఇబో**

నైజీరియాలోని 'ఇబో' తెగవారి కపటముఖాలు చాలా భయంకరంగా ఉంటాయి. దయ్యాలనీ, భూతాలనీ జ్ఞాపకం చేస్తాయి! ఆడవారు వాడేవి మగవారు వాడేవి వేరువేరుగా ఉంటాయి. ఇవి తెల్లరంగు పూసి ఉంటాయి.

ఇక 'కామరూన్' ప్రాంతంవారి కపట ముఖాలు శిల్పాలే. వెడల్పుగా వలకలుగా ఉంటాయి. కళ్ళు గొట్టాలలాగా ముందుకు పొడుచుకుని వస్తాయి! ముక్కూ అంతే! దీనికి తోడు తలమీద ఆకలిగొన్న మిడి గుడ్ల కుక్కల తలలు చెక్కుతారు...

కాంగో, టాంగనీయకా, రొడీషియా, జాంబియా ప్రాంతాలలో పల్చని కపట ముఖాలని చెక్కుతారు. సూక్ష్మంగా ఉన్న శిల్పంలా ఇవి బాజాకుగా కనిపిస్తాయి.

**ఘనా**

ఘనాలో తలగడలు ఎంతో ముచ్చటగా ఉంటాయి. మరగుజ్జు మనుష్యులు ఒక రిద్దరు చతురస్రంగా ఉన్న దిమ్మని మోస్తూ ఉంటారు. ఆ దిమ్మపై తల ఆన్చటానికి వీలుగా మలిచి ఉంటుంది. ఇది క్యూబిసమ్‌ని జ్ఞాపకం చేస్తుంది.

**హుక్కాలు**

దక్షిణకాంగోలో పొగతాగే హుక్కాలు చాలా పనితనం కలిగినవిగా ఉంటాయి. పొగతాగుతూ నవ్వుతున్న ఆడవారిని, వివాహిత స్త్రీలతో దీర్ఘంగా, విచారంగా ఆలోచించే పెద్దమనుషులని హుక్కాలుగా చెక్కుతారు. లోపల డొల్లగా ఉండడ చేత కాల్చే పదార్థాన్ని పైప్‌లాగా పీలుస్తారు.

**ఆహార పాత్రలు**

దాహోమీలో నగ్నంగా కనిపించే స్త్రీల చెక్కడాల నెత్తిమీద గంపలే ఆహార పాత్రలుగా, పళ్లాలుగా వాడ్తారు. కళ నిత్య జీవితంలో ఎలా కలిసి పోయిందో తెల్పేందుకు ఇది మరొక నిదర్శనం.

**శిల్పాలు**

కాంగో శిల్పాలు చాలా అందంగా ఉంటాయి. వాటిలో పాశ్చాత్య సాంప్రదాయాలు బాగా కనిపిస్తాయి. కాని సహజంగా ఉండేట్లు కనిపిస్తూనే, తమ ఆఫ్రికన్ గుణాన్ని మరుగు పరుచుకోవు. ఈ వ్యాసంలో ప్రచురించిన కపటముఖం, కాంగోకి చెందినది. ఇందులో పాశ్చాత్య ఛాయలు గోచరిస్తాయి.

బ్రిటిషు మ్యూజియంలో ఒక ద్వారం, తలుపులు ఉన్నాయి. వీటి నిర్మాణం రోమన్ పద్ధతులని పోలి ఉంటుంది. కాని తయారు చేసినవారు 'కుయు' తెగవారు. ఈ ద్వారం, తలుపుల మీద ఆధునిక దృశ్యాలు చాలా ఉంటాయి— సైకిలు తొక్కే తెల్లజాతివారు, మల్లయుద్ధాలు చేసేవారు, బజారుకి వెళ్ళే ఆడవారు వగైరా. వీటిని చూస్తే కోణార్క్ గుర్తుకి వస్తుంది. నగ్రియలిస్టు శిల్పాలకి కొదవలేదు.

కాంగోలో పాశ్చాత్య ప్రభావాలు చూస్తాము కాని అవి జాతీయ పద్ధతులలో లీనమయిపోక అతికించినట్లు కనిపిస్తూ ఉంటాయి కొన్ని సమయాలలో. అందుకనే ఇక్కడ సృజనాత్మకమయిన అభివృద్ధి తక్కువ, అనే అనుమానం కలుగుతూ ఉంటుంది.

**నైజీరియా**

ఇక్కడి కళా సాంప్రదాయాలు చాలా, ఇటీవలకాలాలకి చెందినవే — కనీసం మనకి తెలిసినవి. క్రీ. శ. 1800 ప్రాంతంలో ప్రారంభమయిన కళా ఉద్యమాలు గమనింప తగ్గవి. దీనిని బట్టి నైజీరియా కళా భండాల మీద పాశ్చాత్య ప్రభావాలు చాలా ఉంటాయని గ్రహించవచ్చు.

ఇక్కడ వారికి ఆడంబరంగా ఉం దుస్తులు ధరించటం ఇష్టం. వాటి కొన్నిటిని చూస్తూఉంటే మన చరిత్ర రాజాధిరాజులు ధరించినట్లు వర్ణించే జ్ఞాపకం వస్తాయి. 14 వ శతాబ్ది బొమ్మలనిబట్టి మామూలు వాళ్ళు కూ కిరీటాలు నగిషీలు చెక్కిన లేసు అం కాలు ధరించేవారని గ్రహించవచ్చు.

"నైజీరియన్ స్త్రీ శిరస్సు" చా సొగసయిన శిల్పం. దీనిలో పాశ్చా ప్రభావాలు కన్పించినా ఇది జాతీయ కోల్పోని కళాసృష్టి. "వేటగాడు" శిల్ప కూడా మనల్ని బాగా కదల్చి వెయ్యగలద ఇబో తెగకి చెందిన శిల్పం ఒకదా బొమ్మ ... చూపాము.



ఏ ప్రక్కనుండి చూచినా శిల్పంలో కన్ను కనిపిస్తుంది మెరుస్తూ. వెలుతురు ప్ర రించడంవల్ల తెల్లగ నిజమైన కన్నులా వుంటుంది

శిల్పం కళ్ళు దీని ప్రత్యేకత! దీని 1951 లో లండన్‌లో "వలస ప్రాం లలో సాంప్రదాయిక కళా ప్రదర్శన" చూసి హెన్రీమూర్ దిగ్భ్రాంతు అయ్యాడుట. అదే పద్ధతిలో తా ఒకటి స్వయంగా తయారు చేశాడుట.

**ఘనా**

ఘనా ధనికదేశం. బంగారం దొరి ప్రదేశం. కాబట్టి బంగారంలో శిల్పా ఉద్భవించటంలో ఆశ్చర్యం లేదు. త మీద పాగాలు, ఒంటినిండా వస్త్రాలక ఈ శిల్పాలలో ఠీవి ఉట్టిపడుత ఉంటుంది. చెక్కడాలలోనే కాక తివాసీ

## ఆఫ్రికా ఖండం...

తయారీలో కూడా ఘనా దేశీయులు సుప్రసిద్ధులయ్యారు. వారి రంగురంగుల తివాసీలని చూస్తూఉంటే బందరు కలంకారీ పని జ్ఞాపకం వచ్చింది నాకు, న్యూగినీ

ఇక్కడి మనుష్యులు జాతరలలో జంతువుల కపటముఖాలని ధరించి నృత్యం



చెక్కలో చెక్కిన ఈ మాస్క్ మన తిరుపతి చెక్క బొమ్మల మాదిరిగ వుంటుంది. రేఖలు మినహాయించి ఏవిధమైన ఆడంబరంగాని లేదు. ప్రశాంతత, ఒకవిధమైన గంభీరతవుంది. ఇటువంటివి ఘనాలో చూస్తాం

చేస్తారు — వానలు కురవాలని, పంటలు పండాలని. ఇక్కడ, న్యూగినీలో తయారయిన "పిట్ట" ఫోటో చూడవచ్చు. ఇది రాతి చెక్కడం. అప్పుడే విత్తులో నుంచి మొలక ఎత్తిన మొక్కని స్ఫురింపచేస్తుంది. పిట్ట రెక్కలు సవరించుకుని పైకి ఎగిరిపోతుందా అనేట్లు ఉంది. ప్రకృతిలో సృష్టికి సమాన స్థానం ఉంది! మొక్క, పిట్ట, చేపన్నా ఒకటే కదా! ●

పసువుల అర్పులోట్టే పాలికాపుల కేకలోట్టే గొల్లగూడెవంతా గంద్రగోళంగా వుంది. గూడేనికల్లా రత్తమ్మ ఒక్కర్తెదే పెంకుటిల్లు. పాల కోసరం ఒచ్చి పోతున్న వారందర్నీ ఎక్కప్రశ్నలు వేసి విసిగిస్తూ వీధరుగు మీద కాళ్లు చాచుకుని కూర్చుంది రత్తమ్మ.

అసలు పాలుపోసే నమ్మకంకన్నా, నోటి దురుస్తనంతోనే రత్తమ్మ ఇంత వ్యాపారం జరిపిస్తూందనుకో వచ్చు. ఎంతటి వార్నయినా కళ్లల్లో దుమ్ము కొట్టేసి పాలల్లో నీళ్లు కలిపెయ్యడం, ఎవరన్నా ఈ తప్పుని కనిపెట్టేశారంటే, ఒట్లూ, సత్యాలూ వేసి వాళ్ల నోరు నొక్కెయ్యడం. ఇలాంటి పనులకి నిజంగా రత్తమ్మకి రత్తమ్మే పోటి.

ఒచ్చేపోయే వాళ్లందర్నీ తనికీ చెయ్యడం అయ్యాక తన ఆకలి తెలిసొచ్చింది గావల్ను రత్తమ్మకి. "ఏమేవ్? అమ్మీ?" అంటూ ఇంట్లోకి చూసి ఒక్కకేక పెట్టింది.

"అయిందత్తమ్మా. ఇదుగో ఆరబెడుతున్నా." నిస్రాణగా ఒచ్చింది బదులు.

"ఆ, పెడుదువుగాని. ఆకల్తో నాప్రాణం కాస్తా గుటుక్కుమన్నాక!" సణుక్కుంటూ కఱ్ఱ సాయంతో ఇంట్లోకెళ్లిన రత్తమ్మ చెయి కడుక్కుంటూన్న పళాన్నే, దూడల్సాల వేపొకసారి దృష్టి పోనిచ్చి, ఒచ్చి అన్నం ఆరబెట్టిన తగరపు గిన్నె ముందు చతికిలబడింది.

రొయ్యపులుసుతో, నాలుగు ముద్దలు తిని ఇన్ని మంచినీళ్లు తాగాక కాస్త తృప్తిపడి "ఈ పూట మిగిల్న పాల చుక్కలేవే?" అంది ఖాళీ తప్పాలాలోకి తొంగిచూస్తూ.

"వైద్యుడు గారింటికి చుట్టాలొచ్చారంటే పోసేశా. ఎలాగా ఆరికి బాకీ, ఉన్నాంగా?"

"ఏటే?. బాకీ వుంటేమట్టుక్కి?. ఇయ్యాలిత్తా, రేపిత్తా అంటూ ఎగేసెయ్యాల గానీ.. సెడబుట్టావే ఫాడుపిల్లా" కోడల్ని శపించుకుంటూ తిండి పూర్తిచేసి గిన్నెలోనే నోరు పుక్కిలించి లేచి, అక్కడే వున్న నులక మంచమెక్కింది రత్తమ్మ.

ప్రతిరోజూ మల్లమ్మకీ చీవాట్లు, పరిపాటే అయినా అసలే చిరాగ్గా వున్నందువల్ల విసుగనిపించి "తోడేసిన పాలు తోడుకునే దాకానన్నా బతుకుతుందో, లేదో నన్నంత ముసిలిదైపోయినా కాపీన్యం మాత్రం ఇంకా వొదల్లేదు!" అని మనసులో అనుకుంటూ, నల్లమందు మాత్రా, మంచి నీళ్ల చెంబూ తెచ్చి రత్తమ్మకిచ్చి పిల్లల్ని న్నాలకు పిలిచింది మల్లమ్మ. కంచాల ముందొచ్చి కూర్చున్న పిల్లలందరి మధ్యా చెంద్రం లేకపోగానే ఆరోజు ఉదయం జరిగిన గొడవంతా మళ్లీ గుర్తుకొచ్చింది మల్లమ్మకు.

రోజూలాగే ఆరోజూ తనతోపాటే పెంద్రాలే లేచి ఇంటి పనుల్లో సాయంచేసిన చెంద్రం పాలు తీసేందుకు దూడల్సాల్లో కెళ్లాడు.

"ఏదో ఈనాటికి పిల్లలైనా కాస్త చేతికందుకున్నారు గదా" అని సంబ్రబపడుతూ, వీధివాకిలికి కళ్లాపు జల్లుతూంది మల్లమ్మ.

మల్లమ్మ సంతోషించినంత సేపట్టలేదు. వెనక వేపుమంచి వినవచ్చాయి రత్తమ్మ పెడుతూన్న రంకెలు. చేతులో పనలాగే ఒదిలేసి అటుపరుగెత్తిన మల్లమ్మ, "ఏవిట్రా చెంద్రం ఈ గొడవంతానూ?" అంది. రత్తమ్మెత్తిన కఱ్ఱ చెంద్రం నెత్తిని పెట్టకుండా పట్టుకుంటూ.

"ఏంలేదమ్మా. ఆవుపాలని చెప్పి, నీళ్లు కలిపిన గేదెపాల్ని నాయుడు గారింటికి పోస్తూంది మామ్మ. జబ్బు పిల్లాడి కిచ్చేవి దగా చెయ్యడం పాపం కదానని వెల్లాపు పాలు పోసి పంపా. అంతే." అన్నాడు నవ్వుతూ చెంద్రం.

"ఆ. ఏడిశావ్‌లేరా. ఎదవసన్నేసీ. పాపవంట. పున్నెవంట! ఏటో ఇయ్యన్నీ సచ్చి నాకటి మాట. మరి నేనూ ఇసుమంటి భయాల్ను నమ్మకూర్చునుంటే! మీరంతా ఇప్పుడేం తిని బతికే ఓళ్లురా ఎండుగడ్డి?"

"ఒకర్ని దగాచేసి తినే తిండికన్నా అది నయమేగా?" అన్నాడు మెల్లగా చెంద్రం. పావుచెవుల రత్తమ్మ కెలాగో వినిపించేసి నట్టుంది మాట.

"ఇన్నావు టే అమ్మీ. ఈ చెంద్రం పొట్టపొగురూ! అడ ఎగడ్డే తిని బతుకుతాడో, మరొహటే తిని బతుకుతాడో నాకు తెల్దుగానీ. ఇటు సీద ఆడికీ కొంపతీ ముద్ద పెట్టావో? నే పస్తుండి సస్తా తెలిశిందా?" అంది పళ్లు లేనందున కోప తీరా ఇగుళ్లు కొరుక్కుంటూ రత్తమ్మ ఏవనేందుకూ తోచక మౌనంగా మల్లమ్మింట్లో కెళ్లిపోతే దూడలన్నింట్ల సాల్లో కట్టేసి తనూ బడి కెళ్లిపోయాడ చెంద్రం.

"అయినా. నీ సదువు సట్టబండలై తే నీవల్లొచ్చిందే ఇదంతానూ. ఆణ్ణి సదవ య్యొద్దేమ్మ తల్లీ, అంటూ నే నెం మొత్తుకున్నా ఇనక నన్ను పోసిపొమ్మని స వ్వేశావ్. మరి ఆడికింకెంత శేపూ ఆ బేమ్మర బాసా, బేమ్మర్ల నీతులూ అబ్బుతున్నయె గాని, మన బతుకు తెరువూ మన ఒయిన ఎందుకొత్తై?" అని తన్లోతనే మాట్లా కుంటూ మెట్టు మీద చతకిలబడిం రత్తమ్మ. అంతే పరగడుపుతో పొద్దు వెళ్లినవాడు. మధ్యాన్నం ఇంటికొచ్చినపు కూడా, పసువులకు గడ్డీ నీళ్లూ చూపిం తనూ కడుపునిండా నాలుగుచేతుల నీళ నూద్దగ్గరే తాగేసి, దీనంగా తనవే చూస్తూ నిల్చున్న తల్లిని తిరిగి, తిరి చూసుకుంటూ బడికెళ్లిపోయాడు. ఇం కన్నా ఎక్కువ గొడవలు జరిగినప్పుడలా కూడా ఇంటికి రావడం మాని ఎరగ చెంద్రం ఇవాళ సాయింత్రం పాలు పిం డానిక్కూడా రాకపోవడంవల్ల మల్లమ మనసు మరింత ఆందోళన పడిపోతూంది అయినా మనసులో ఎన్ని బెంగలుంటే మాత్రం అస్వతంత్రరాలైన తనేం చెయ గల్దని. ఛీ. ఏవజ్జీవనం బానిసగా బతి తనదీ ఓ బతుకేనా?

చెంగుతో కళ్లు తుడుచుకుని పిల్లలకి ఒడ్డనకానిచ్చి, చెంద్రంతో పాటు తనూ పస్తే పడున్నందున, ఇంటిపన్లు పూర్తి కాగానే ఒచ్చి వసారాలో స్తంభానికి జేరబడి కూర్చుంది మల్లమ్మ.

చిన్నప్పట్నుంచీ సవిత్తల్లివల్ల కష్టాల పడుతూ, భవిష్యత్తులోనైనా తనకి సుఖం వుండక పోతూందా అని, పుట్టెడాశతో గాలిమేడలు కట్టుకుని మురుస్తూన్న తనని పట్టుదలగా కోరి వీరయ్య పెళ్లి చేసుకున్న



గాడే, ఒక్క కష్టం అనుభవించడానికి మాత్రమే తను జన్మమెత్తిందని విశ్వసించ కున్న మల్లమ్మ, పులిబోనులో కెళుతున్న మేకపిల్లలాగ రత్తమ్మింట్లో పాదం పెట్టింది.

అయితే వీరయ్య తను భయపడ్డంత దుర్మార్గుడు కాకపోవడమే గాకుండా తనని కోడంటికం పెడుతూన్న రత్తమ్మని కూడా అప్పుడప్పుడూ మందలిస్తూండడం చూసి తన గుడ్డి అదృష్టానికి మురిసిపోయింది మల్లమ్మ.

ఆపాటిగానన్నా మల్లమ్మనాళ్లో సుఖ పడలేదు. ఒకరోజు మదిరి గోడ మీదనించి తనని రహస్యంగా పిల్చిన పొరుగింటి కొం డమ్మ, "మీ ఆయన గూడెం నుంచేవత్తేనో లేవదీసుకొచ్చి ఆ పూరిపాకలో పెట్టుం చాట్టేమల్లీ?".. అని మెల్లగా చెవిని వేసింది.

"అలాగా ఒదినా?" అని బాధగా అంటూ పెంటదిబ్బ మీదికెక్కి ఆ గుడిసె వేపు చూసిన మల్లమ్మ అవమానంతోటీ ఆశా భంగంతోటీ కుంగిపోతూ ఇంట్లో కెళ్లి పోయింది.

అంతే అనాటి నుంచి రోజుకు రోజు

# చక్రాల్లో చెందం

వీరయ్య పెట్టే బాధలూ, రత్తమ్మ పెడు తూన్న రంపపు కోతకి మించిపోసాగాయి. ఇన్ని ఇబ్బందుల్ని మల్లమ్మ ఓర్పుతో భరించు కొస్తూన్నా, తల్లి పడుతూన్న కష్టాల్ని చూసి సహించలేని చెంద్రం మాత్రం తరుచూ తండ్రితోనూ నాయనమ్మతోనూ వాదించి అందుకు ఫలితంగా చావుదెబ్బల్ని తింటూండేవాడు.

చెంద్రాని దొక ప్రత్యేకమైన మన స్తత్వం. ఎవరికన్యాయం జరిగినా ఏప్రాణి కష్టపడ్డా అతను చూశ్లేకపోయేవాడు. అయితే ఏ గొప్ప ఇంటి బిడ్డకన్నా ఈ అల వాట్లుండి వుంటే భవిష్యత్తులో ఆదర్శ వంతుడుగా వుండగల్గే లక్షణాలుగా అవి ప్రజల కనిపించేవేమోగాని చెంద్రం విష యంలో ఈ అలవాట్లు "పాలమ్ముకునే వాడి కింత పెత్తనం, ఇంత నోరు దురు సతనం వుంటే ఎక్కడ మస్సుతాడూ" అన్న అపఖ్యాతి తెచ్చి పెట్టడమే గాకుండా ఎన్నో కష్టాల క్కారణమయ్యాయి.

ఒకసారి మునసబుగారి బండి కింద ఒక ముసలివాడు పడిపోతే ఆ బండిలో అతన్ని వదేసి త్వరగా హాస్పిటల్‌కి తీసుకెళ్లమని ప్రాధేయపడ్డాడు ఆదార్నే బడికెళుతూ, ఈ విపత్తుని చూసిన చెంద్రం.

అయితే అసలే తన పని అడిపోయిందని విసుక్కుంటూన్న మునసబు, బండి కడ్డం నిలబడ్డ చెంద్రాన్ని తిట్టి అవతలి కీడ్పించ డమే గాకుండా తిరిగొచ్చాక వీరయ్యతో చెప్పి చావ తన్నించాడు.

ఇంకోసారి స్నేహితుడింటి కెందుకో వెళ్లిన చెంద్రం అప్పటికి మూడురోజు లాయి జ్వరంలో వున్న అతని తల్లి ఆకలితో శోషపోవడం చూసి దబ్బున తను పాలుపోసే ఒకరింటి కెళ్లి నాలుగు రూపాయ లడిగి తెచ్చి ఆ అమ్మకి మందులూ, కాఫీ వగైరా లన్నీ తెచ్చిచ్చి సాయపడ్డాడు.

అయితే తరవాత ఒక నాలానికల్లా బాగా కోలుకుని ఆ మనిషి తిరిగి దంపుకి వెళ్లి సంపాదిస్తున్నా, ఎన్నిమార్లడిగినా చెంద్రం బాకీ మాత్రం ఇవ్వలేదు. పాపం చేసేదిలేక, తీరుబడున్నప్పుడల్లా బజార్లో కూలిగంపలు మోసి రత్తమ్మకు తెలియనివ్వకుండా ఎప్పట్లా సొమ్ము సర్దేశాడు చెంద్రం.

ఇవన్నీ చూస్తూ ఊర్కోలేక మల్లమ్మ ప్పుడైనా గనక మందలిస్తే, "ఇంతమాత్ర మన్నా ఒకరికి సాయపడకపోతే ఇక మనుషు లమై ఎందుకు పుట్టినట్టమ్మా" అనేవాడు చెంద్రం.

ఇవన్నీ గుర్తు తెచ్చుకుంటూ పెరాగ్గా కూర్చునున్న మల్లమ్మ గాలికి తలుపు ఊగిన చప్పుడు వినగానే చెంద్రమే వచ్చాడన్న భ్రమతో దబ్బున లేచింది.

"ఎన్నెల గోడ మీది కెళ్లిపోయింది గదా. నువ్వింకా తొంగో లేదంటే. అమ్మీ?" అంది ఓ నిద్రకానిచ్చి లేచిన రత్తమ్మ మంచం కింది మంచినీళ్ల చెంబు నందుకుంటూ.

"పాలముంతల్లో తోడుపొయ్యాలత్తమ్మా" అంటూ లోపలి కెళ్లి ఆరిపెట్టిన ముంత ల్లో తోడు చుక్కలు వేసి ఉట్టి మీద పెట్టేసి చదువుకుంటూన్న పుస్తకాల్తో దీపం చుట్టూ అలాగే పడుక్కుని నిద్ర పోతూన్న పిల్లల్ని సరిగ్గా చాపల మీద పడుక్కోబెట్టి దీపం తగ్గించి తలుపోర వాకిలి చేసి మళ్లీ స్తంభం వద్దనే కూర్చుంది మల్లమ్మ.....

"ఆ పెద్దగాడిద మద్దినేలొచ్చి ముద్ద తిన్నాడా?"

"వాడి కన్నం పెడితే నువ్వు పస్తుంటూ



న్నావ్‌గా?"

"అందుకని?.. అమ్మా కొడుకూ బిగుసుకుని కూకున్నారేంటే? ఏటో, అన్నా, ఆడివా మీ కోసరమేగానీ, సచ్చేముండని వాకేం కావాలే ఇంకా.... ఏటో ఊరోళ్ల మద్దరించుకుంటూ ఆడు బొత్తిగా బైరాగోడై పోతున్నాడు గందానని. 'కాంత కుర్రోడికి బయంసెప్పు బాబూ' అని ఆ పంతుల్ని బతిమలాడ్దొచ్చా—"

"ఆ? ఎంత పని చేశావత్తమ్మా. సీకటంటే వాడికి సచ్చేంత బయం. వెనకటికి వాళ్ల నాన్న గదులో పెట్టి గొళ్ళెం వేసేటరికీ ఫెళ్ళున జెరం ఒచ్చెయ్యలేదూ?" అంటూ దబ్బున లేచి బయల్దేరబోయింది మల్లమ్మ.

"ఆ! ఆగవే సన్నాసీ! అందుకని ఇంత రాత్రి వేళ ఆడకూతురొక్కత్తెవూ ఈదిని బడి పోతానంటావుటే. ఆ పంతులికి, మాట్టకీ పిల్లల్లేరనా?" అంటూ ఒక్క కసురు కసిరింది రత్తమ్మ. చేసేదిలేక మళ్లీ వసారా మీదికొచ్చి చతికిలబడింది మల్లమ్మ. ఏదో అర్థంకాని బాధ మల్లమ్మని దహించేస్తోంది.

"అబ్బ? ఏవిటీ తాపం?" అనుకుంటూ పెంటదిబ్బ మీదికెళ్ళి ఆ పూరిగుడిసె వేపు చూసింది మల్లమ్మ. అంతా ఒకే చీకటి. తన పిచ్చిగాకపోతే ఏడాదిగా ఖాళీ అని తెలుసుండీ ఇప్పుడు తవా ఇంటి వేపు ఎందుకు చూసినట్టూ? అదే తనకీ అర్థం కావడం లేదు.

ఇప్పుడే కాదు. శరీరకంగా మానసికంగా తన కెప్పుడెలాటి చిరాకు ఒచ్చినా దిబ్బ మీది కెళ్లి పాడుపడ్డట్టుగా వున్న ఆ యింటి వేపు కాస్సేపు భ్రమగా, ఆత్మబంధువుల్నెవర్నో చూసినట్టు చూడ్డం, వైరాగ్యం, విషాదంతో కూడిన వింత తృప్తేదో మనసుక్కల్గడం సంవత్సరం నుంచీ తనకు పరిపాటైపోయింది. అయితే ఈ రాత్రి ఎన్నిసార్లలా చూసినా మనసుకి స్తిమితం కుదరడంలేదు తనకి.

ఏడాది క్రితం సంగ్గా ఇలాంటప్పుడే ఆదరా బాదరా తన పినతండ్రి లోపలికొచ్చి "ఆ దొంగముండని ఎంటేసుకుని ఈ ఊరిగాడు రంగం ఎళ్లిపోయాట్టే అమ్మీ?" అన్నాడు రొజుకుంటూ. "నిజంగా నేనా బాబాయి?" అంటూ దబ్బున దిబ్బ మీది కెళ్లి ఆ గుడిసె వేపు చూసింది తను. వెంటనే ఏదో అర్థం తెలియని వైరాగ్యం స్థిరంగా నాటుకుపోయింది తనలో. అయితే తన స్థితికి బాధపడుతూ తండ్రి కోసరం చెంద్రం పడ్డ శ్రమా, చేసిన ప్రయత్నాలూ ఇన్నీ అన్నీకావు.

అలాంటి చెంద్రం కోసరం తనిప్పుడేం చేసింది? ఎప్పుడూ మాత్రం ఏంచేసి ఒరిగించింది? ఇలా యమయాతన పడుతూ రాత్రంతా ఎలాగో గడిపేసిన మల్లమ్మ, తెల్ల తెల్లవారుతూన్నప్పుడే లేచి ఇంట్లో ఎవ్వరితోనూ చెప్పకుండా పెరటి దడి, తడికెని దగ్గరగా వేసుకుని చీరె చెంగు ఒంటినిండా కప్పుకుంటూ నాలుగు వీధులూ నడిచి పెరటి దోవని పంతులింట్లో ప్రవేశించింది.

"ఇంత పెంద్రాలే ఇలా ఒచ్చావేం మల్లమ్మా." అన్నాడు అప్పుడే నిద్రలేచిన పంతులు ఆవలించుకుంటూ.

"అదే బాబూ, మా చెంద్రంగాణ్ణి—" చేతుల్నలుపుకుంటూ అంది మల్లమ్మ.

"ఆ. అన్నట్టు కాస్త భయపెడదావని!" అంటూ మేకునున్న తాళం చెవి తీసుకుని నూతివేపు నడిచాడు పంతులు.

"ఆ. ఆ ధాన్యంకొట్లోనా?" బలు వెక్కిన గుండెల్ని చేత్తో రాసుకుంటూ పంతులు వెంట నడిచింది మల్లమ్మ.

"ఒరేయి చెంద్రం?" అని పిలుస్తూ తాళం తీసి లోపలి కెళ్లిన పంతులు "అయ్యో?" అని ఒక్క అరుపరుస్తూ వెనక్కి గెంతాడు.

"ఏం బాబూ? ఎవయిందీ వా చెంద్రానికీ" అంటూ తొంగి చూసిన మల్లమ్మ, "వా బాబూ" అని వెర్రిగా ఒక్కకేక పెడుతూ వెనక్కి ఒరిగిపోయింది.

"కుయ్యో, మొర్రో? మంటూ పంతులు పెట్టిన కేకలికి వీధుల్లో వారంతా పోగై చేతిని చుట్టుకునున్న నాగుపావుతో సహా చెంద్రాన్నివతలికి తీసుకొచ్చారు. ఒళ్లంతా కరిచేస్తూన్న పావుపీకని ఎలాగో చెంద్రం పట్టేసుకు నుంటాడనీ, అందువల్లే విషం ఎక్కి ఒళ్ళు కొయ్యబారిపోయినప్పుడు చేతులోవున్న సర్పం కూడా చచ్చిందనీ అందరూ కలిసి నిశ్చయించి, ఎవరికి తెలిసిన పాము ప్రమాదాల్నివారు వింత వింతలుగా చెప్పసాగారు.

"ఓ రాత్రి పంతులుగారూ, చచ్చానండీ" అన్న కేకలు వినిపిస్తే ప్రయివేటు కొచ్చిన కుర్రాణ్ణెవర్నన్నా పంతులు తన్ను తున్నాడేమో అనుకున్నాం" అని కొందరూ,

"ఒళ్లంతా బాధ. తలుపు తియ్యండీ అంటూ అర్ధరాత్రి తలుపులు గుంజిన చప్పుడు స్పష్టంగా వినిపించి ఇంటి భూతవైద్యుడేదన్నా మంత్రిస్తున్నాడనుకున్నాం మేవంతానూ" అని మరికొందరూ వగిచారు.

"పసిపిల్లాణ్ణిలా బలవంతాన్న చంపేశాడు. వీణ్ణి నిజంగా పోలీసుల కప్పగించాద్దూ" అని కొందరు చాటుగా ఎగిరితే "ఏదో ఇరుగూపొరుగూ విరోధం చేసుకోవడం తప్ప అతను మాత్రం చెయ్యాలని చేశాడా పాపం" అని సమదాయించారు మరికొందరు.

"బాబూ, అయిందేదో అయింది. ముందా మల్లమ్మకి తెలివి తెప్పించే ఉపాయం చూడండి బాబూ" అని వాపోయాడు పంతులు.

అంతవరకూ ఆమాటే మర్చిపోయి బాతాఖానీ కొడుతూన్న వారంతా మల్లమ్మ



'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రమురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన బొమ్మలు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి. సం॥



# చుక్కల్లో చంద్రం

చుట్టూ చేరి శాయశక్తులా ప్రయత్నించి ఎలాగో తెలివి తెప్పించారు.

మెల్లగా కళ్ళువిప్పి వెర్రిగా నాలుగు వేపులా ఓసారి కలియజూసిన మల్లమ్మ ఏదో అర్థంగాని మొండి ధైర్యం తెచ్చుకుని చంద్రం దగ్గర చేరింది.

"నాబాబూ, నాచంద్రం ఈపాడులోకం నీవంటివాళ్ళ నెప్పుడూ అర్థంచేసుకో లేదురా నారాజా, అందుకే నీకీ సహాయం చేసి పుణ్యం కట్టుకున్నాడు పంతులు. వెళ్ళు బాబూ. మవ్వుండదగ్గ పుణ్యలోకానికి నువ్వెళ్ళు" అంటూ చంద్రం చెక్కిళ్ళు తనివి తీరా ముద్దుపెట్టుకుని లేచిన మల్లమ్మ లంగోస్త్రంతో కళ్ళు తుడుచుకూంటూ అపరాధిలా అక్కడే నిలబడున్న పంతులుకి చెయ్యెత్తి ఒక్క దండం పెట్టి, మళ్ళీ వెళ్ళి చంద్రాన్నింతసేపు ఒళ్ళంతా తడివి తల నిమురుతూ లేచి చీరె పిడుచుకుంటూ ఇంటికి బయల్దేరింది. ఆమె ప్రవర్తనని బట్టి మతేమన్నా భ్రమించిందేమో నన్న భయంతో ఒకరిద్దరు వెంటరాబోతే ఒద్దని వారించి వెళ్ళి పోయింది మల్లమ్మ.

"పాపం! ఇంత దుఃఖం ఎలా భరిస్తుందోగానీ. చిన్నవాడైనా మాదొడ్డవాడు చంద్రం!" దారిపొడుగునా ఈమాటే మల్లమ్మ చెవుల్న పడుతూంది.

సగందారి వెళ్ళేసరికే ఏడ్చుకుంటూ ఎదురైన మల్లమ్మ పిన తండ్రి, మల్లమ్మని ఆదరంగా పట్టుకునిబయల్దేరాడు. ధైర్యం చెపుతూ.

"ఒద్దుబాబాయి? ఇంటికెళ్తున్న నాకు సాయిం ఎందుకూ! అక్కడ నాచంద్రం ఒంటిగాడై పోయాడు. దబ్బున నువ్వెళ్ళి నిపయంటా వాణ్ణి సాగనంపిరా." దుఃఖాన్ని దిగమింగు కుంటూ వెళ్ళిపోయింది మల్లమ్మ.

అదివరకే ఈకబురు విన్న రత్తమ్మ కుమిలి కుమిలి ఏడుస్తున్నదల్లా, కోడల్ని పట్టుకుని బోరుమంటూ చంద్రం మంచితనాన్నంతా వర్ణించి, తనకర్మ కాల కర్మాన్ని తనే నిందించుకో సాగింది.

"హు? నాచంద్రాన్ని బలితీసుకున్నా గాని నీకళ్ళు విడలేదు గొడ్డాల్నా" అంటూ వెర్రిగా ఒక్క నవ్వునవ్వి, పిచ్చిదాన్లా కాస్సేపటూ అటూ తిరిగాక పాలోస్తో కళ్ళి దూడల్నొదిలింది మల్లమ్మ. చెంగుచెంగున గెంతుకుంటూ వచ్చిన దూడలు తమని ఒదిలింది చంద్రంకాదని తెల్సుకోగానే పొదుగులో మూతి పెట్టకుండా బెదురు చూపులు చూడసాగాయి. పసువులకు తిండి ముందు పెట్టి పాలు తీసేందుకు కూర్చుంది మల్లమ్మ. వెనక్కి తిరిగి మూజూచిన ఆవులు చంద్రం కాదని తెల్సుకోగానే, గోలెంలో తిండి ముట్టుకోకుండా ఉండిపోయాయి. చేసేదిలేక కళ్ళుతుడుచుకుంటూ బియ్యం చేటముందు పెట్టు కూర్చుంది మల్లమ్మ.

పిల్లలందర్నీ దగ్గర కూర్చోపెట్టుకుని కుములుతున్న రత్తమ్మ ఇరుగు పొరుగూ పరామర్శకి వచ్చినప్పుడల్లా ఓరాగం పెడుతూంది. పగలంతాబెంగగా తిరుగుతూ దీపం పెట్టగానే వెళ్ళి నిద్ర పోయారు పిల్లలు.

పిల్లిలా లేచిన రత్తమ్మ కర్రతో దారి తడువుకూంటూ, భ్రమపడ్డట్టు ఆరుబయట కూర్చునున్న మల్లమ్మ వద్దకొచ్చి "ఏడుస్తున్నావా అమ్మా?" అంటూ దగ్గర కూర్చుంది మల్లమ్మ చెక్కిళ్ళు చేతో తడువుతూ.

మల్లమ్మేమీ మాట్లాడ లేదు.

"పాడుముండని. ఇన్నాళ్ళూ నిన్నెంతో ఉసురు పోసుకున్నాను.. నాజిమ్మడితే నిన్ను నానా కూతలూ కూశాను. ఏపాపాన్నబోతానో పాడుదాన్ని. ఇదిగో, చేసిన పాపం శానగానీ, ఈపైని ఇల్లూ దూళ్ళూ అన్నీ నువ్వే చూసుకుని సిపిల్లలతోపాటు నాకింత ముద్ద పడెయ్యి చాలు. వల్లమందు ముండ"ని అంటూ చెంగునున్న తాళాన్నిప్పి బలవంతంగా మల్లమ్మచేతులో పెట్టేసి, తనబరువు తీరిందన్నట్టుగా అక్కడే చెంగు పరచుకుని నడుం వాల్చింది.

ఉన్నట్టుండి రత్తమ్మలో కల్గిన ఈ ఈమార్పుకి విస్మయంతో కాస్సేపు కూర్చున్న మల్లమ్మ మళ్ళీ ఎప్పట్లా బాగా తన ఆలోచనల్లో మునిగింది. అన్నీ చంద్రాన్ని గురించిన సంఘటన్లే.

తనయాతన్నని చూసి సహించలేక చెరువుదగ్గర రావిచెట్టు కిందనున్న విఘ్నేశ్వరుడి పాదాలమీద పడి విలపించసాగాడు చంద్రం.

"దేవుడి పాదాలమీద కన్నీరు కారుస్తావుట్రా. దుర్మార్గుడా" అంటూ చంద్రాన్ని ఆవతలకీడ్చి నీళ్ళు తెచ్చి విగ్రహాన్ని కడగ బోయాడు స్నానంచేస్తున్న

HIMALAYAN

FINEST GOLDEN DUST TEA

# LIPTON'S

FINEST
GOLDEN DUST TEA

LHGC-2 TE

# మేలిరకం "డస్ట్" టీలలో సాటిలేనిది

## లిప్టన్స్
## హిమాలయన్
## గోల్డెన్ డస్ట్ టీ



ఈ టీతో మీరు కమ్మని, చిక్కని బంగారు ఛాయగల టీ కప్పుల వెంబడి కప్పులు అతి త్వరలో తయారుచేయకలుగుదురు. ఈ పానీయమును మీరే త్రాగి చూడండి. మీ అతిథులకుకూడా యివ్వండి. మీరు తప్పక సంతోషముతో వికసిస్తారు. అవును — మీ ఆనందభరితులైన అతిథులుకూడాను. లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ మేలిరకం టీలలో నిజంగా అద్వితీయమైనది.




లిప్టన్స్
అంటే
మంచి టీ

ఒక్క బ్రాహ్మడు

స్నానానికొస్తున్న పెద్దకరణం. చెవిన ఈవిషయం పడగానే—

"శాస్త్రేవయ్యా ఒక్క జీవకారుణ్యం తప్ప అన్నింపున్నాం మరేదీ వెరగని ఆచెంద్రం కళ్లనీళ్లు ఆలు బిడ్డల్ని సురు పెట్టుకుంటూ, అక్కనువుదార్ని మసిలే, నీచేతినీళ్లకన్నా ఎంతో పవిత్రమైనవేలే. మహా శుద్ధి చెయ్యొచ్చావ్." అన్నాడు అందరి ఎదుటానూ.

"నిజం నా చెంద్రం దేవుడు. నాచెంద్రం దేవుడు" అని పైకే వెర్రిగా అనుకో సాగింది మల్లమ్మ.

"నాచెంద్రం. నాచెంద్రం. ఇకమీద నన్నా నాచెంద్రం చాటున నీతిగా బతుకు దామనుకొని, ఆపాపపు బతుకుని అప్పుడే ఒదిలేసి పుట్టెడాసెతో నేనొచ్చానే మల్లీ!" అని వాపోతూ ఒచ్చి మల్లమ్మ రెండు చేతుల్నీ పట్టుకున్నాడు వీరయ్య, భర్త లోని మార్పుకి భ్రమ పట్టినట్టుగా ఒక్కనిముషం అతనివంకచూసి, "నాబాబూ! ఇప్పుడు గనక నువ్వుండి వుంటేనే!" అను కుంటూ భర్త భుజంమీద వాలిపోయింది మల్లమ్మ.

"అమ్మా?" గలగలా నవ్వుతూ. చెంద్రం పిల్చినట్టయింది. ఇదేవిటి? తనభ్రమా? వెర్రిగా వెలుగు వైపులా చూశాక పైకి చూసింది మలమ్మ.

"చూశావా అమ్మా? నేబతికుండగా తీరని నాప్రయత్నాలన్నీ ఇప్పుడు ఫలించాయి. నాకోరికలన్నీ తీరాయి. నువ్వు సుఖంగా సంతోషంగా వుండడమేనమ్మా నాక్కావలసింది. శెలవు." అంటున్నాడు. చేతులు జోడించుకుని చిరునవ్వుతో చెంద్రుడి మధ్య నిలబడున్న చెంద్రం.

"అయ్యొ నాతండ్రీ! నువ్వు అనుభవించని సుఖం, నువ్వుపొందని స్వేచ్ఛా! నాకు మాత్రం ఎందుకురా బాబూ! ఒద్దు ఒద్దు" వెర్రిగా అరిచింది మల్లమ్మ .

"ఏమిటే అమ్మీ. ఎక్కడ చూశావే వాణ్ణి?" పక్కనే నిలబడ్డ వీరయ్యా, పడుక్కుని లేచిన రత్నమ్మా ఒకేసారి అడిగారు మల్లమ్మని.

బోసినోరు వెళ్లబెట్టుకునున్న రత్నమ్మనీ, బలువుగా ఊపిరొదుల్తా నిలబడున్న వీరయ్యనీ. రెండు చేతులా దగ్గరగా తీసుకుంటూ,

"అడుగో కనిపించడం లేదూ. ఆచుక్కల మధ్యనున్న చెంద్రుళ్లో నాచెంద్రం" అంది దుఃఖంతో కూడిన ఆనందంతో మల్లమ్మ.

వారందర్నీ ఏకంచేసినందుగ్గాను చెంద్రం రాల్చిన ఆనంద భాష్పాలేమో నన్నట్టుగా ఆముగ్గురిమీదా చల్లని చినుకుల్ని రాల్చింది ఎట్నుంచో ఒచ్చిన ఒక చిన్న మబ్బు. ●

# అలసటా? నాకులేదు!








టైపుచేయటం అలసట కలిగించవచ్చు. కాని ఓవోమాల్ట్ ఒక కప్పు తాగితే రోజంతా టైపుచేసినా అలసట అనేది ఉండదు. రోజల్లా శ్రమపడి పనిచేసి సాయంత్రం ఇంటికి చేరేసరికి ఒక కప్పు కమ్మని ఓవోమాల్ట్ నాకోసం సిద్ధంగా వుంటుంది. సాయంకాలం సరదాగా గడపటానికి కావలసిన శక్తినీ ఉత్సాహాన్నీ అది నాకు సమకూరుస్తుంది.

నిజం, గ్రానులర్ ఓవోమాల్ట్ పరిపూర్ణమైన ఆహారపానీయం. విటమిన్లు, అప్పటమైన పాలు, బార్లీ మాల్ట్ ఎక్స్ట్రాక్టు, కోకోలతో నిండివున్నట్టిది. తేలికగా జీర్ణమవుతుంది. పగలల్లాపడిన శ్రమ తర్వాత రాత్రి హాయిగా నిద్రపట్టి, ఆరోగ్యంగా ఉండేందుకు ఉపకరిస్తుంది.

## ఓవోమాల్ట్



తయారు చేయువారు,
పుడ్స్ ఫాట్స్ & ఫర్టిలైజర్స్ లిమిటెడ్,
తాడేపల్లిగూడెం, ఆంధ్రప్రదేశ్.

విక్రయాల విభాగం: 115-బి, నేతాజీ సుభాష్‌చంద్రబోస్ రోడ్డు, మద్రాసు-1.

EP-FFP-19

# అత్తగారూ-నీళ్లబండి బసవయ్యా





భానుమతీ రామకృష్ణ

తోటలో యిల్లు కట్టుకోవాలని ఉబలాట పడ్డామేగాని మంచినీళ్ల సంగతి ఆలోచించలేదు. తోటలో వున్న రెండు బావుల నీళ్లూ ఉప్పుగాకపోయినా బురద నీళ్లు. పూలమొక్కల కోసం, వరిపంట కోసం రెండు పంపుసెట్లు పెట్టించినందు వల్ల నీళ్లు బురదగానూ, మడ్డిగానూ వుంటాయి.

మా అత్తగారి మడినీళ్లు అవే అయినా మాకు ఆ నీళ్లు తాగాలంటే గొంతు పట్టుకుంటుంది. ప్రతిరోజూ కారు యింటి నుండి ఎన్నిసార్లు బయటి కెళితే అన్నిసార్లు మా పాత యింటి నుంచి, కుళాయి నీళ్లు రెండు పెద్ద డ్రమ్ముల్లో తెప్పిస్తూండేవాళ్లం. ఏ రోజైనా డ్రైవర్ నీళ్లడ్రమ్ములు కార్లో పెట్టడం మర్చిపోతే యిక ఆరోజు మాకు బావి నీళ్లే శరణ్యం.

ఆ తెచ్చే రెండు డ్రమ్ముల నీళ్లకూ మా తోటలో దొంగలుండేవాళ్లు.. మా కాపలావాడి పెళ్లాం, మా తోటవాడి పెళ్లాం.. యిద్దరూ చెరోరెండు బిందెలూ పుచ్చుకుని రెడీగా వుండేవాళ్లు. కారు వస్తూనే డ్రైవర్ను మంచి చేసుకుని గేటు దగ్గిరే కారాపి డ్రమ్ముల్లో వున్న నీళ్లు బిందెల నిండా నింపుకుని కారు లోపలికి వదిలేవాళ్లు... నేను ఒకరోజు చూసి మా అత్తగారికి తెలిస్తే గొడవవుతుందని మాట్లాడక వూరుకున్నాను. కాని డ్రమ్ములో సగం నీళ్లు తగ్గడం మా అత్తగారు ఒకటి రెండు సార్లు అడిగారు "ఏమిట్రా 'సగం నీళ్లే తెస్తారు'.. అంత పెట్రోలు ఖర్చుపెట్టి అంత దూరాన్నుంచి నీళ్లు తెప్పిస్తుంటే, యీవిధంగా సగం డ్రమ్ములు, పట్టుకొస్తారేమిట్రా' అని.

"లేదు పెద్దమ్మగారూ! డ్రమ్ముల నిండుగా నీళ్లు పట్టుకొస్తే రోడ్లో గతుకులకి డ్రమ్ములు కులికి నీళ్లు ఒలికి పోతాయి" అనేవాడు డ్రైవర్. కాబోలు అనుకునేది మా అత్తగారు.. ఒక్కోసారి ఒట్టి ఖాళీ డ్రమ్ములు తెచ్చేవాడు. "ఏమిట్రా యిదీ, నీళ్లేవీ, అంటే "అయ్యో పెద్దమ్మ గారూ! ఏం జెప్పమంటారు యీ లారీ వాళ్లు కళ్లు మూసుకోని తోల్తారు. లేచినేళ మంచిది. లేకపోతే కారే వుండేది గాదు. యిక నీళ్లంటే .. షడన్గా కారు తిప్పేశాను.. బండిపక్కనే వున్న పల్లంలోకి దిగింది.. డ్రమ్ములు దొర్లిపోయినయి" అంటూ డ్రైవర్ జరిగిందంతా యాక్షన్తో చెప్తూంటే మా అత్తగారు గుండె బాదుకుంటూ "హవురా! హవురా! ఎంత గండం తప్పింది! నీళ్లు పోతే పోయినయ్ కారు దక్కింది" అనేవారు.

కాసేపటికి వెనక నుంచి మా పని పిల్లవాడు (డ్రైవర్ విరోధి) వచ్చి నాకు చెప్పేనాడు అసలు విషయం.. డ్రైవర్ వా. దోవలో కారాపి ఆడవాళ్ల దగ్గిర బిందె అర్ధరూపాయి ప్రకారం నీళ్లు అమ్ముతున్నాడండమ్మగారూ అంటూ.. అంతేగాదు ప్రతి రోజూ నీళ్ల కోసం ప్రొద్దుటే వెళ్లినప్పుడు నేరుగా నీళ్లు పట్టుకు రాకుండా వాళ్ల యింటికెళ్లి వాళ్ల యిద్దరి పిల్లల్నీ కార్లో ఎక్కించుకుని స్కూలు దగిర దింపి తర్వాత నీళ్లు పట్టుకొస్తాడమ్మా అని కూడా చెప్పాడు. అందుకే అంత ఆలశ్యం అవుతూంది రోజూ నీళ్లు తేవడానికి.. యీ విషయం మా అత్తగారికి చెప్పడమా మానడమా!.. చెప్తే గొడవవుతుందని వూరుకున్నాను. యిక మీద కార్లో మంచినీళ్లు తేనక్కర్లేదని చెప్పేశాను డ్రైవర్కి. "మరి ఎట్లాగే మీకు నీళ్లూ!" అన్నారు మా అత్తగారు..

"మీ అబ్బాయి గానీ, మీ మనవడుగానీ బయటి కెళ్లొచ్చే కార్లో ఆ రెండు, డ్రమ్ములూ పడేసి నీళ్లు పట్టుకురమ్మంటే సరి.. యిక మీద మనుషులు లేకుండా నీళ్ల కోసం కారు పంపకూడదు" అన్నాను.

"అవునే! నేనూ అదే అనుకున్నాను. ఎంత పెట్రోలు! ఎంత ఖర్చు! మీరు నీళ్లు తాగుతున్నారు! పెట్రోలు గదా త్రాగుతున్నారు." అంటూ వాళ్లబ్బాయితో చెప్పేశారు. విధిగా ఆయన బయటికెళ్లేప్పుడు కార్లో రెండు డ్రమ్ములూ పడేసి కెళ్లి యింటి కొచ్చేప్పుడు డ్రైవర్ చేత నీళ్లు పట్టించుకు రావాలి అని, మనవడికీ అమాటే చెప్పారు.. కాలేజీకి వెళ్లేప్పుడు డ్రమ్ములు పట్టుకెళ్లి యింటికొచ్చేప్పుడు నీళ్లు పట్టించుకు రావాలని మావారు చిరాకు పడుతూ "అసలెందుకీ బాధంతా సిమ్సన్ కంపెనీకి ఆర్డరిస్తే నూరు గేలన్ల నీళ్లు పట్టే బండి ఒకటి తయారు చేసి యిస్తారు" అన్నారు.

"అట్లాగా! మరి నాకేం తెలుసు యీ తబిసీళ్లన్నీ, మసల్దాన్నీ. వెంటనే ఆర్డరివ్వు. అయితే ఆ బండికో బసవయ్య కావాలెగా" అన్నారు మా అత్తగారు.

"బసవయ్యెవరమ్మా" అన్నారు మావారికి అర్థంగాక.





"ఎద్దురా! బండికి ఎద్దు కావద్దూ!..

"ఓహో! మన దగ్గరున్నట్లున్నయ్యే ఒకటో, రెండో ఎద్దులు!.."

"అవి ఆవుల్రా. ఎద్దులుగావు" అంటూ ఉడికిపడి నవ్వారు మా అత్తగారు..

"ఏమో! నాకేం తెలుసీ గొడ్ల గొడవ? బండి రెడీ చేయించడం వరకూ నా వంతు." అంటూ తప్పుకున్నారు.

"అయితే ఎద్దును కొనడం మా వంతటా!.. సరే మన మేనేజర్ని పంపు. రేపు శుక్రవారం పల్లావరం సంత కెళ్లి ఒక ఎద్దును తోలుకు రమ్మంటాను..."అన్నారు మాఅత్తగారు..

శుక్రవారంనాడు మేనేజరు పల్లావరం సంతకు బయల్దేరాడు. ఎద్దును కొనే 'బడ్జట్' నూటయాభై రూపాయలన్నారు మాఅత్తగారు.. మేనేజరు ఇబ్బందిలో పడ్డాడు. "ఒకవేళ పాతిక రూపాయలు అటూ ఇటూ అయితే ఫర్వాలేదా" అని నన్నడిగాడు మాఅత్తగారు వినకుండా... ఫర్వా వుండదని చెప్పాను...

సాయంకాలానికి మేనేజరు తిరిగి వచ్చాడు.. "ఎద్దేక్కడా" అన్నారు మాఅత్తగారు మేనేజరు జేబులు వెతుకుతూ... మేనేజరు వెలవెలబోతూ "నేను బస్సులో వచ్చాను.. ఎద్దును రేపు తోలుకొస్తారు. అదీకూడా మనకు రేపు ప్రొద్దుటే టెలిఫోన్ చేసి తోలుకొస్తారు. మిమ్మల్ని అడక్కుండా ఎట్లా తోలుకురమ్మనేది..ఎద్దు మాత్రం చాలా మంచిది. సాధువు.. మన నీళ్లబండికి సరిగ్గా వుంటుంది."

"అందుకే గదయ్యా నిన్ను సంతకు పంపింది.. అక్కడ మంచి గొడ్లు దొరుకుతాయి."

"ఇది సంతలో దొరికిన గొడ్డు గాదండీ! సంతలో అన్నీ నాసిరకం గొడ్లున్నాయి. ఒక్కఎద్దుకూ బండిలాగే ఓపిక లేదు. ఒట్టి ఎముకల గూళ్లలా వున్నాయి గొడ్లన్నీ.. కొన్నయితే మరీ చిన్నదూడల్లా వున్నాయి. అక్కడొక ముసలాయన్ని విచారిస్తే తన దగ్గర మంచి ఎద్దు వుందన్నాడు పక్కనే వున్న పల్లెటూళ్లో.. సరే చూపించమన్నాను ఎద్దును.. చూడక్కర్లేదు. మైసూరు బసవేశ్వరుడిలా వుంటుంది ఎద్దు. అందానికి అందం వుంది, పరమసాధువు. ఎంతిస్తారు డబ్బు" అన్నాడు. నూటయాభై రూపాయలన్నాను.. మూడు వందల రూపాయలిస్తే ఇస్తానన్నాడు.. చివరకు బేరం చేసి రెండువందల యాభైకి ఒప్పించాను." అన్నాడు మా అత్తగారి రియాక్షన్ కనిపెడుతూ. ఆమాట విన్న మాఅత్తగారు ఉళ్లిపడి

"రెండువందలయాభయ్యే! నీకేమన్నా మతిపోయిందటయ్యా? నీళ్లబండి లాగే ఎద్దును రెండువందలయాభైకి కొంటారా ఎవరన్నా..."

"అవునండీ నూటయాభైలో మంచి ఎద్దురాదన్నారు అక్కడి వాళ్లంతా.

"అక్కడి వాళ్లంతా అంటే అన్నారేం.. ఇక్కడి వాళ్లు వుందన్నారు.. మన పాలవాడికి తెలిసినవాళ్ల దగ్గర ఏదో మంచి



ఎద్దు వుందట.. నూటయాభైకే ఇస్తారట. తోలుకు రమ్మని చెప్పాను. ఆ పల్లావరం ఎద్దు అంత ఖరీదుపెట్టి కొనడం నాకిష్టంలేదు." అన్నారు మా అత్తగారు. పాపం మేనేజరు చిన్నబుచ్చుకున్నాడు.."సరేనండి ఆలాగే రేపు ప్రొద్దుటే వాళ్లు ఫోన్ చేస్తారు. మన నెంబరిచ్చి వచ్చాను. ఒద్దని చెప్పేసెయ్యొచ్చు.." అన్నాడు మేనేజరు.

"అడ్వాన్సేమైనా ఇచ్చావా" అన్నారు, మాఅత్తగారు మేనేజర్ని కొరకొర చూస్తూ...

"లేదండీ. ఒక్కరూపాయి ఇచ్చి వచ్చాను శాస్త్రానికి.."అన్నాడు.

"ఒక్కరూపాయేగా పోతే పోయింది" అన్నారు మాఅత్తగారు చప్పరిస్తూ..

ప్రొద్దుటే మా అత్తగారు పాలవాడు చెప్పిన ఎద్దు కోసం ఎదురు చూడ్డం మొదలెట్టారు.. పల్లావరంనుండి ఫోనొచ్చింది 'ఎద్దును తోలుకురమ్మంటారా' అని. నేను ఒక్కక్షణం ఆలోచించి, ఈరోజు మంచిదికాదు రేపు ప్రొద్దుటే మళ్లీ ఒకసారి ఫోన్‌చేసి తోలుకురమ్మని చెప్పాను మా అత్తగారు వినకుండా.

పాలవాడు చెప్పిన ఎద్దును తోలుకొచ్చారు. ఆ ఎద్దును అయిదు మంది పట్టుకొచ్చారు తలనిండా తాళ్లుకట్టి బ్రహ్మాండమైన ఎద్దు. పంపర్లు తిరిగి పెద్ద కొమ్ములతో తల వూపుతూ పట్టుకున్న వాళ్ల చేతుల్లో నిలవకుండా చిందులు తొక్కుతూన్న అంత పెద్ద ఎద్దును చూసి మాఅత్తగారు నిర్ఘాంతపడి పోయారు.

అంత పెద్ద ఎద్దు ఎందుకు నీళ్ల బండికి అంటారనుకున్నాను..కాని తక్షణం మాఅత్తగారి పెదాల మీద చిరునవ్వు కనిపించింది. ఏదో ఆమెకు స్వప్న వస్తే అటువంటి చిరునవ్వు కనిపిస్తుంది.. నన్ను దగ్గిరికి రమ్మని సైగ చేశారు.. నాచెవులో చెప్పారు. 'ఎద్దు గొప్పది.. ఇంత పెద్ద ఎద్దు నూటయాభై రూపాయలకు దొరకడం చాలా అదృష్టం అనుకోవాలి.. ఏమంటావ్' అన్నారు.. నిజమే అంత తక్కువ ఖరీదుకు దొరికే ఎద్దుగా కనిపించదు.. కాని ఎందుకు దొరుకుతుందో దానిలో ఏం లోపంవుందో అనే అనుమానం కలిగింది. అంతమంది మనుష్యులు దాన్ని పట్టుకోడం, ఎద్దు ఒకచోట నిలవకుండా తలవిసురుతూ చిందులు తొక్కడం చూస్తే నా అనుమానం ఎక్కువైంది. మా అత్తగారితో



చెప్పాను.. ఆమె అలక్ష్యంగా చప్పరించి "యివన్నీ యీ ఎద్దుల్ని అమ్మేవాళ్ల ట్రిక్కులే.. నాకు తెలీవనుకుంటారు వెధవలు.. ఎద్దు చాలాగొప్పది అని తెలియజేయడం కోసం అంతా హంగామా. దారిన పోయేవాళ్ల నెవర్నో కాస్త ఎద్దును పట్టుకు రమ్మని వుంటారు.. అంతా నాటకం" అన్నారు. కాబోలు ననుకున్నాను.

"ఎద్దును అంతమంది పట్టుకుంటే ఎట్లాగ్రా, బండికి కట్టి చూడండి" అన్నారు మా అత్తగారు. బండి తెచ్చి కట్టారు బండి మీద రెండుగజాల ఎత్తున్నది ఎద్దు. మా బండివాడు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వడం మొదలెట్టాడు.. యింకా ఎద్దును అయిదుగురు పట్టుకోడం చూసి "యింకా మీరంతా ఎందుకర్రా ఎద్దును పట్టుకుంటారు!.. వదిలేయండి.. మా బండి వాడు తోలిచూడాలి." అన్నారు మా అత్తగారు.

"బాబోయ్ పెద్దమ్మగారూ పిల్లామేకా గలోణ్ణి నే తోల్ను" అన్నాడు మా బండి వాడు.

ఎద్దును పట్టుకున్న అయిదుగురూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ముందు వైపు పట్టుకున్న యిద్దరు ఎద్దును వదిలేశారు. తక్షణం ఎద్దు ఒక్క విదిలింపుతో వెనక వాళ్లను కిందికి తోసి బండితో సహా క్రిష్ణలీలల్లో రాక్షసుడిలా మాయమైంది.." ఆ.. అంటూ అందరం నిర్ఘాంతపోయి ఎద్దుకోసం వెనక పరిగెడుతున్నవాళ్లను చూస్తూ వుండిపోయాం...

అప్పుడే వచ్చిన మేనేజరు చెట్టు వెనక నుంచి వచ్చాడు మెల్లిగా.. మా అత్తగారు అతని ముఖం చూశాక అవస్థపడ్డారు ...

"చాలా పోకిరీ ఎద్దు.. అబ్బా! ఎంత పెద్ద ఎద్దండీ".. అన్నాడు హడలెత్తిపోయిన మేనేజరు.

"మరి ఆ పల్లావరం ఎద్దు తోలుకు రమ్మని చెప్తామా" అన్నాను.

"ఆ మరి ఏదో కావాలిగా బండికి!.. దొంగవెధవలు ఏదో మంచి ఎద్దే తెస్తార్రు గదా అనుకున్నాను.." అని సణుక్కుంటూ లోపలి కెళ్లారు.. మర్నాడే మా నీళ్లబండి బసవయ్య వచ్చాడు పల్లావరం నుంచి.. బసవయ్య ముఖంలో కళ, అణుకువ, ఓర్పు, గంభీరం ఒకటేమిటి! అన్ని మంచి లక్షణాలూ కనిపించాయి.. అన్ని సుగుణాలూ

# అత్తగారూ...

మూర్తీభవించిన బసవయ్య బండికి సరిపోయాడు. బండి లాగించి ట్రైల్, చూశారు.. యీ మహా సంసారాన్ని లాక్కెళ్తున్న భగవంతుడిలా ఆ బండిని నెమ్మదిగా, హుందాగా లాక్కెళుతున్న బసవయ్య అందరి మన్ననలకూ పాత్రుడయ్యాడు.. బండివాడు బసవయ్యను ముద్దుపెట్టుకని దిష్టి తీశాడు.

రోజూ బండివాడు బసవయ్య సుగుణాలను మెచ్చుకుంటూ ఒక్కదెబ్బ తినకుండా సౌజన్యంతో నీళ్లబండి లాక్కొస్తున్నట్టు చెప్పాడు..

మా అత్తగారికి బసవయ్యంటే చాలా అభిమానం ఏర్పడ్డది. తనే స్వయంగా తెలగపిండీ, పొట్టూ పట్టెరా తినిపించేది బసవయ్య చేత.. ఉలవ పిండి రెండుపూటలా



పెట్టించేది.. బసవయ్య అన్నీ తాపీగా పుచ్చుకుంటూ బండి కట్టే వేళకు తనంతట తనే వచ్చి బండి దగ్గిర నిలబడేవాడు...

"ఆహా! ఆహా! యిది ఎద్దుగాదే!.. యిది మనిషీగాదు.. మనుషుల కింత జ్ఞానం, ఎక్కడిది.. కేవలం పూర్వజన్మలో మహర్షి నున బసవయ్యా.." అంటూ మా అత్తగారు బసవయ్యను మెచ్చుకునేవారు మా అత్తగారు..

వున్నట్లుండి మా బండివాడి తల్లి పోయిందని సడన్‌గా వాళ్ల వూరు వెళ్లిపోయాడు. వాడు వెళుతూ ఎవర్నో తెలిసిన వాడిని బండి నీళ్ళు తేవడానికి తోట పనికి పెట్టి వెళ్లిపోయాడు.

ఆ కొత్తవాడు మా అత్తగారికి నచ్చలా. వాడు జట్కావాడు కావడం, బీడీలు తాగడం వాడి ప్రవర్తన చూసి "వీడొట్టి రౌడీవెధవే" అన్నారు మాఅత్తగారు.

కొత్తవాడు మాఅత్తగారికే కాకుండా మా బసవయ్యకు కూడా నచ్చలే.. మొదటి రోజు బండి కడుతూనే ఒక్క చరుపు చరిచాడు. బసవయ్యకు ఓర్పెక్కువ గనక తమాయించుకున్నాడు. కొత్తవాడికి అడ్రసు తెలీదని మాపాత యింటి అడ్రసు రాసి బండివాడి చేతికిచ్చారు. బండివాడు ఎవర్నీ అడిగే అవసరం లేకుండానే నేరుగా బండి మాపాత యింటికి తీసుకెళ్లాడు బసవయ్య. అందుకే అది ఎద్దుగాదే! మహర్షి... అన్నారు మాఅత్తగారు. వచ్చిన రెండో రోజు నీళ్లకు పోయిన కొత్త బండివాడు సాయంకాలం నాలుగు గంటలయినా రాకపోవడం చూసి "ఏమిటే! యీ కొత్త వెధవ బండినీ బసవయ్యనూ యింకా తీసుకురాలేదే" అంటూ మా అత్తగారు ఆదుర్దా పట్టడం మొదలెట్టారు.

సాయంకాలం ఆరుగంటలకు తోలుకొచ్చాడు బండిని తూలుతూ...

ఆ రాత్రి భోజనానికి కూర్చోబోతున్న మా అత్తగారు వెండి కంచం, చెంబూ గ్లాసూ కనిపించడం లేదని ఖంగారు పడుతూ వంటవాడూ తనూ వెదకడం మొదలెట్టారు.. ఎక్కడా కనిపించకపోవడంతో కొత్త బండివాడిని అనుమానించారు...

"ప్రొద్దుటే బసవయ్యకు తెలగపిండీ, ఉలవ పిండీ కావాలని వంటింటి వేపు వచ్చాడు.. అందరం హాల్లో వున్నప్పుడు వాడు వెనక తారట్లాడుతూ వుండడం చూశానే..పోనీ వాడిని పోలీసులకు పట్టిస్తే" అన్నారు. 'ఒకవేళ వాడు తియకపోతేనో' అన్నారు మిగతా వాళ్ళు..

ఏం చేయాలో తోచక మా అత్తగారు ఆ వెండికంచాన్నీ, చెంబునూ వర్ణిస్తూ అవి రెండూ తనకు చేసిన సేవనూ ఆ వెండి యొక్క ఔన్నత్యాన్నీ, ఆ వెండి ఎన్ని పాత వెండి పాత్రల నుండి గ్రహించబడ్డదీ, ఆ పాత్రలన్నీ ఏనాటివో, ఎట్లాంటి సందర్భాల్లో చేయించబడ్డవో, అవన్నీ కరిగించి చివరకు కంచం, చెంబూ తయారు చేయించానని వాటి హిస్టరీ చెబుతూ కంట తడి బెట్టారు.. పోనీ లేమ్మా యింకో చెంబూ కంచం చేయించుకోవచ్చులే అని కొడుకు ఓదార్చినా ఆ కంచం చెంబూ గొప్పతనం వాటిలో వుండే వెండి యొక్క 'క్వాలిటీ' రాదని చెప్పి బాధపడ్డారు.

ఆ సమయంలోనే మా పాత బండివాడు వచ్చాడు.. వాడిని చూస్తూనే మా అత్తగారి

ప్రాణం లేచొచ్చింది.. జరిగిందంతా వాడికి ఒక్కక్షణంలో చెప్పి తన అనుమానం అంతా ఆ కొత్త బండివాడి మీదే వుందన్నారు. వాడు కూడా సందేహిస్తూ నేను నెమ్మదిగా కనుక్కుంటా నమ్మగారూ మీరు దిగులు పడకండి..అంటూ మా అత్త గారికి హామీ యిచ్చాడు.

మర్నాడు కొత్తవాడిని తోటవని చూస్తూండమని చెప్పి పాత బండివాడు బసవయ్యకు ప్రేమగా తిండిపెట్టి, నీళ్ళు తాగించి, బండి కట్టి తీసుకెళ్ళాడు.

పాతవాడు మామూలుగా వచ్చే టైమ్‌కు రాలేదు.. వీడికీ ఏమొచ్చిందో తెగులు అని సణుక్కుంటూ, నా కంచం, చెంబూ, ఏమయినాయో అంటూ కలవరిస్తూ కూర్చున్నారు మాఅత్తగారు..

గేట్లో బసవయ్య మెళ్ళో గంటల చప్పుడు వినిపించింది. మరుక్షణం, మాపాత బండివాడు, పెద్దమ్మగారూ పెద్దమ్మగారూ అంటూ పరుగెత్తుకుంటూ లోపలి కొచ్చాడు. "ఏమిట్రా! ఏమైంది"..అంటూ మా అత్తగారు ఎదురెళ్ళారు.. వాడు సంతోషంతో ఉక్కిరిబిక్కిరై మాటలు రాక అవస్థపడి, "మీవెండి కంచం, చెంబూ దొరికినయ్ అమ్మగారూ...." అంటూ చేతిలో వున్న పాత గుడ్డల మూట విప్పి చెంబూ కంచం బయటికి తీశాడు... మా అత్తగారు సంతోషంతో పొంగిపోయి బండివాడిని ఎంతో మెచ్చుకుంటూ వందేళ్ళు బ్రతకమని దీవించారు. ఆనంద భాష్పాలను తుడుచుకుంటూ— వాడు ఆ దీవెనలన్నీ బసవయ్యకి చెందుతాయన్నాడు.

"బసవయ్య కెట్లా చెందుతాయిరా" అని అడిగారు మా అత్తగారు.

"మన బసవయ్య ఎద్దుగాదు పెద్దమ్మగారూ! నిజంగా అది బసవేశ్వరుడే.... మనం అంతా మొక్కాల్సిన నందీశ్వరుడు మన బసవయ్య.... బసవయ్యే లేకపోతే మీ కంచం చెంబూ దొరికేయి కావు."

"ఎట్లాగా!"

"అవునమ్మగారూ! నేను యీడ నుంచి బండి కట్టుకొని ఎళ్ళాను గదండీ! నేను ఎప్పుడూ నేరుగా మన పాతింటి కెళ్ళి నీళ్ళు తీసుకొని ఎక్కడా ఆక్కుండా యింటి కొచ్చేస్తాండి. అది అలవాటు.... యీ రోజు పోతావుంటే షడన్‌గా ఒక బీడీ దుకాణం ముందు ఆగాడండి బసవయ్య— నాకు ఆశ్చర్యం ఏసి ఏందిరా యిదీ? బసవయ్య యిక్కడెందుకాగాడు అనుకుంటూ వుంటే, ఆ కొట్టోడు నన్ను చూసినవ్వి 'ఎద్దు బలే తెలివైందే! నువ్వు లేనప్పుడొచ్చిన బండోడు నా కొట్లో బీడీలు కొనుక్కునేవాడులే. అందు కాగింది. అన్నాడు..' బసవయ్య బుద్ధిశాలి తనాన్ని ఏం మెచ్చుకొనే దమ్మగారూ! మళ్ళీ బయల్దేరాను. నేరుగా రోడ్లో బోయేదల్లా షడన్‌గా మలుపు దిరిగి ఒక సందులోకి బండి లాక్కుపోయింది.. నేను ఎంతో మళ్ళించాలని చూసినా నావల్ల గాలా. పక్కన మురిక్కాలవ పక్కన చిన్న చిన్న గుడిసెలు. ఆ సందులో బండి ఎళ్ళడమే కష్టం. ఎందుకు బసవయ్య యిటెడుతున్నావని నేను అడుగుతుండంగానే వో గుడిసె ముందాగాడు బసవయ్య.. కిళ్ళీ కొట్టుకాడ ఆగినట్టాగిందే అని అనుమానం గలిగింది.. బండి సప్పుడిని లోపల్నించి వో పడుసు పిల్ల పరిగెత్తుకొచ్చి "ఎవురయ్యో నువ్వు! మామ రాలేదా!"— అంది... వోహో అనుకున్నా.... బండిదిగి గబగబా లోపలి కెళ్ళా.... నా కనుమానం ఎక్కువైంది.. ఒక పాశికేసి చూద్దాం పార్తుందేమో అనుకొని "చూడమ్మాయ్.. మీ మామ శానా యిబ్బందిలో వుండాడు.. వాడేమన్నా మీ దగ్గిర దాచి పెట్టమని యిచ్చాడా!" అన్నా రహస్యంగా దాని చెవు దగ్గరకెళ్ళి.... మొదట బిత్తరచూపుల్తో తటపటాయించి తర్వాత అవునని తలూపింది.. లొట్టిరిగి నేతిలో పడ్డాదని ఆ పిల్ల తల్లికాడ చెప్పా, 'వాడిని పోలీసుల్లా వెతుకు తున్నారు. పట్టుకుంటే ఆడిచ్చిన వస్తువులు మీ యింట్లో వున్నాయ్యని చెప్తాడు. పోలీసులు మీ గుడిసెమీద పడతారు కాసేవట్లో' అని...



ఆ ముసల్ది బాబోయ్ అని పెద్ద కేకేసి నా రెండు చేతులూ పట్టుకుని "చూడు బాబూ ఆ ముదనష్టపోడు ఒక వెండి కంచం, చెంబూ తెచ్చి నాకిచ్చి దాచి పెట్టమన్నాడు... నా పిల్లని పెళ్ళి చేసుకుంటా నన్నాడు గదా అని బుద్ధి గడ్డితిని దాచిపెట్టా.... యిదుగో అట్టనే పెట్టెలో పెట్టా..." అంటూ యీ మూట తెచ్చి నా చేతికిచ్చి అది వాడి చేతికే యిచ్చెయ్యమని, పోలీసులకి సంగతి చెప్పొద్దని బతిమాలింది.... చెప్పనని చెప్పి ఆ మూట తీసుకొని అదే రావడం— నీళ్ళు గూడ



తేలా పెద్దమ్మగారూ...." అని వాడు చెప్తూంటే

"హవురా! హవురా!! ఎంతపని, ఏంసంగతి ఆ జట్కా వెధవ ఒట్టి దొంగ వెధవ. నాకు వాడు వచ్చిన రోజే తెలిసి పోయింది -

ఏడీ! నా బసవయ్య! నా మహర్షి ఎక్కడ' అంటూ గబగబ బయటి కొచ్చి బండి క్కట్టివున్న బసవయ్యను పొగడ్తల్తో ముంచెత్తారు... దీర్ఘాయుష్మతో వుండమని దీవించారు....

ఆ రోజు బసవయ్యకు గొప్ప విందు చేశారు. బసవయ్య తిండి కొంత మేము తిన్నాం... ఆ రోజునుంచి మా నీళ్ళబండి బసవయ్యకు మా యింట్లో చాలా గొప్ప స్థానం యివ్వబడ్డది.... బండివాడు మారినప్పుడు పొరపాటున కూడా ఏ కొట్టు దగ్గిరా బండి ఆపేవాళ్ళు కాదు.. బసవయ్యంటే బండి వాళ్ళకు హడల్.. ●

# వారఫలం

## 11-11-1966 శుక్రవారం మొదలు 17-11-1966 గురువారం వరకు.

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీరు యేమి చేసినా తప్పుపట్టే ఉద్దేశంతో కొంత మంది వ్యక్తులు వ్యవహరిస్తారు. వారం మధ్యలో చికాకులకు గురి కావలసి వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో ఐక్యం చేసికోవడం తగదు. మానసిక ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు— అధిక వ్యయం జరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం :** కొన్ని వ్యవహారాల్లో మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో భేదాభిప్రాయాలు రావచ్చును. భారీయెత్తున చేసే వ్యాపారాలు ప్రారంభించడానికి యిది సమయం కాదు. అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది, బంధు మిత్రులను కల్సుకుంటారు.

**మిధునం :** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్థిరాస్థి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్త వచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధు మిత్రులను కల్సుకుంటారు.

**కర్కాటకం :** మీ స్వంత పనుల మాట యెలాగ ఉన్నా, యితరుల వ్యవహారాల్లో శ్రద్ధ వహించవలసి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు శ్రమ మీద నెరవేరుతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. విలాస వస్తువులు కొంటారు.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో శ్రమ కలిగినా దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కన్య :** మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. మాలిన విషయాలను తెల్సుకొంటారు. సాటి వారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు.

**తుల :** ఆదాయం మాట యెలాగ వున్నా, సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం ఆఖరులో లాభించగలవు.

స్త్రీలకు— కుటుంబకార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. వారాంతంలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. సాంఘిక కార్యక్రమాల్లో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

**ధనుస్సు :** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల ముందుముందుకూడా తగిన ఉపయోగం ఉంటుంది. ఆర్థికంగా మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉన్నా, యితరుల నిమిత్తం శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో చికాకులు కలుగుతాయి. వ్యాపారంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు ఆటంకాలు వచ్చినా, ఏదో ఒకవిధంగా అన్ని వ్యవహారాలను పూర్తిచేయగలరు. వృత్తిలో నూతన మార్గాలద్వారా ఆదాయం పెరుగుతుంది. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. వారాంతంలో ఆకస్మికంగా వ్యయ ప్రయాసలకు గురి కాగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంఘ సేవికలకు మంచి సమయం.

**కుంభం :** వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మీనం :** అన్ని వ్యవహారాలు అనుకూలంగానే కన్పిస్తాయిగాని మీరు యెంతమాత్రం యేమరుపాటుగా ఉన్నా, చికాకులు వస్తాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వృత్తిలో ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాటి వారితో మాట పట్టింపులు తగవు.

—మహేష్ ●

# * మూడవ బహుమతి పొందిన కథ *

"హరిరెంత ఇబ్బంది పడి చదివిస్తున్నారో నాకు తెలుసు. నా కోసమని మురళి ఎన్ని అవకాశాలకు దూరమవుతున్నాడో కూడా నాకు తెలుసు. కాని చదువు మీది ఈ వ్యామోహం నన్ను ముందుకు లాక్కుపోతున్నది. ఏడాదితో ఇది పూర్తి అయి ఈ కాళ్ళ మీద నేను నిలబడినపుడు మీ ఇద్దరి ఋణాన్ని చేతనయినంతవరకు తీర్చుకో యత్నిస్తాను. అందాక క్షమించండి"

అంటూ రాశాడు వేణుగోపాలం.

కాలేజీ వాళ్ళలో కలిసి ఏవో వూర్లు తిరిగి రావడానికి అయిదారు వందలు కావాలని రాస్తే పంపాడు. అందుకోసం పెద్దవాడే రామాయణమంతా రాశాడు. వాడెప్పుడూ ఇంతే—అనుకున్నారు హరిహర శాస్త్రిగారు.

వేణులో తానున్నాడు. మురళిలో వాళ్ళమ్మ వుంది. దీపంవలె ఇంటో ఒక ఆడపిల్ల నడయాడాలని లక్ష్మి ఎంతో ఆశించింది. కాని ఆ వాసుదేవుడికి దయలేక పోయింది. పుట్టని కూతురిని వెతుక్కుంటూ వెళ్ళిపోయింది లక్ష్మి. ఈ భవబంధాలన్నీ ఎందుకు తెంచి వేస్తున్నావో తెలియలేదయ్యా కృష్ణా అనుకున్నారు శాస్త్రి.

పట్నాలకు వెళ్ళడం— పెద్దచదువులు చదవడం—ఊర్లు తిరగడం, ఇవన్నీ నా చేత కావు బాబూ... ఉన్న రెండెకరాలూ దున్నుకుంటూ ఇంటిపట్టున పడివుండక ఎందుకొచ్చిన లిప్పలు—అంటాడు మురళి.

జ్ఞానం ఒక జ్యోతి—చదువొక వెలుగు. దానిని వెంబడించాలి. అన్నిటిని చూడాలి. ఎందరినో కలవాలి. జీవితాన్ని చదవాలి— ఇది వేణు.

తృప్తి నీడలో బ్రతుకుతున్నాడు వీడు. తృష్ణ కొంగు పట్టుకు పరుగులిడుతున్నాడు వాడు.

ఒక్కచెట్టున కాచిన ఫలాలివి! నవ్వుకున్నారు హరిహరశాస్త్రిగారు. వీధిలోకి చూశారు.

ఎండచచ్చినా ఎరుపు చావలేదాకాశం మీద. పశువులు ఇళ్ళకు చేరుతున్నాయి. వాటి డెక్కల నుండి లేచిన ధూళి ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నాయి. గొల్లవాడొకడు గేదె మీద అడ్డంగా కూచుని పరమానందంతో పిల్లనగ్రోవి వూదుతోన్నాడు.

'మన్దం మన్దం మధుర నినదై ర్వేణు మాపూరయన్తం
బృన్దం బృన్దావన భువి గవాంచారయన్తం చరన్తం...'

అని ఆలపించారు శాస్త్రిగారు.

"నమస్కారాలు బాబుగారూ!" అని నమస్కరిస్తూ వీధికి అవతల వైపుగా తొలగి నడుచుకుంటూ వెళ్ళాడు కరణం గారు.

అపుడే పొలం నుండి వస్తున్న, మురళి ఇది గమనించాడు. నాన్నగారిని చూశాడు.

విశాలమైన ఫాలభాగం. ఎప్పుడూ కానవచ్చే ఎర్రటిబొట్టు. చేతికి మురుగులు. గంభీరమైన విగ్రహం. దివ్యతేజంతో అలరారే ఆ కళ్ళు..

మెడ వెనుక చేతులానించి, కండ్లు మూసుకుని వీధి అరుగు మీద కూర్చుని వున్న తండ్రిని చూసి మళ్ళీ తెలుసుకున్నాడు మురళి— ఆయనను చూసిన క్షణం కరణమయినా కలెక్టరయినా భక్తి భావంతో తలవంచి ప్రణమిల్లి మరీ ఎందుకు కదులుతారో!.. నియమబద్ధమైన జీవితం, నీతి తప్పని జీవితం, మనిషికిచ్చే అధికారాలలో ఇదొక్కటి కాబోలు అనుకుని, ఆయనకు నమస్కరించి, లోపలికి అడుగువేశాడు.

"మధ్యాహ్నం భోజనానికి రాలేదేమిరా?" అని అడిగింది అమ్మమ్మ. ఆమెకు జవాబు చెప్పి స్నానంచేసి వీధిలోకి వచ్చాడు మురళి.

"ఇదిగో మీఅన్నయ్య వుత్తరం"అంటూ పడేశారు శాస్త్రిగారు. చదివాడు మురళి.

"అన్నయ్య ఉత్త పిచ్చివాడు" అన్నాడు. శాస్త్రిగారు నవ్వారు.

"అయిదు వందలూ ఎట్లా పంపారూ? మనియార్డర్ చేసినట్టు లేదే" అన్నాడు మురళి. తామున్న పంపాపురానికి ఆరు మైళ్ళవతల వున్న 'దివ్వె' పోస్టాఫీసుకు వెళ్ళితే తానే వెళ్ళి వుండాలి కదా, మరి వెళ్ళలేదే అనుకున్నాడతడు.

"మన సూరిగాడి బావమరిది హైదరాబాద్ వెళ్తుంటే, వాడితో పంపించానురా.. నీతో చెబుదామని మరిచాను"

కాస్సేపు పొలం విషయాలేవో చెప్పాడు మురళి. అన్నీ విన్నారు శాస్త్రి. మురళి చివర చెప్పాడు.

"మన వూళ్ళో ఆస్పత్రి పెడతారట!"

"ఎవరు?"

"రుక్మిణమ్మట!"

లిప్తమాత్రం ఆ నొసట చికాకేదో మెరిసి మాయమయింది. శాస్త్రిగారు లేచారు "పూజ కాలస్యమయింది—"

* * *

"గేటుకు ఆ ఎర్ర రంగేమీ బాగు లేదండీ.. తెల్లరంగే వేయించండి."

"అట్లాగేనమ్మా!"

"డాక్టరు గారుండబోయే ఇంట్లోకి బావికి పంపుపెట్టేశారా?"

"ఆ పని నిన్ననే అయిపోయింది కదండీ! పంపులోంచి నీళ్ళు వచ్చేస్తుంటే జనమంతా బలే విడ్డూరంగా చూస్తున్నారు" అన్నాడు వెంకయ్యగారు.

నవ్వింది రుక్మిణమ్మ.

గౌరి తన మనవరాలు అయిదేళ్ళది ఇట్లాగే నవ్వుతుంది అనుకున్నాడు వెంకయ్య తాత.

ఆయన రుక్మిణమ్మగారి ఆస్తిపాస్తుల వ్యవహారాలకు మేనేజర్ లాంటివాడు. అది ఇన్‌కంటాక్స్ వారి ఇరుకు సందులే కానివ్వండి, సర్కారు చట్టాలలోని చిట్టడవులే కానివ్వండి వెంకయ్యగారు వాటిలోకి ఈల వేసుకుంటూ వెళ్ళిపోయి, దారి తప్పకుండా వెనక్కొచ్చేయగలరు.

ఆయనంటే రుక్మిణమ్మగారికి విపరీతమయిన అభిమానం. వెంకయ్యగారూ, వెంకయ్యగారూ అంటూ ఆయన లేకుండా ఏ పనికీపూనుకునేది కాదు.

మరి ఆయనకో? ఆమె చాల చిత్రమయిన, గొప్పమనిషి. తన పూర్వజన్మ సుకృతం వల్ల దేవుడు తన్నా చల్లనితల్లి దగ్గర పడేశాడు. అన్నది వెంకయ్యగారి మనసు.

చుట్టుపక్కల నలభై మైళ్ళలో, ఎక్కడా మందుగాని సరైన డాక్టరు గాని



లోక జనం తల్లడిల్లుతూంటే దాదాపు యాభై లక్షల వేల రూపాయలు పోసి ఆ భవనం కట్టించి దాన్లో మంచాలు, పడకలూ, ఏర్పాటు చేయించి ఇల్లు, భోజనం కాక నెలకయిదు వందల జీతం మీద డాక్టరును నియమించి మందులూ అవీ తెప్పించి—మొత్తం మీద పంపా పురంలో నారాయణయ్య ఆస్పత్రి అంటూ ఒక ఆస్పత్రిని నెలకొల్పిందావిడ. ఇంకో నెలలో ఈ ఆస్పత్రి తెరిస్తే, హమ్మయ్య! ఈ ఊళ్లోని వెయ్యిమందికే కాదు, చుట్టు ప్రక్కల గ్రామాల వారికీ ఎంత పెద్ద సహాయం! రోజుకు ఎన్నిసార్లు మొక్కితే మా ఋణం తీరేను.

అని అనుకుంటూ నిల్చున్న వెంకయ్య కళ్లు తడితడిగా లవడం చూసిన రుక్మిణమ్మ అడిగింది—"ఏమిటి, వెంకయ్యగారూ?"

ఉత్తరీయంతో కళ్లు తుడుచుకుని, "ఏమీ లేదమ్మా, ఒక మనిషి మంచితనం ఎంతమందిని ఉక్కిరిబిక్కిరి చేస్తుందో అనుకున్నా నంతే" అన్నాడు వెంకయ్య.

"మంచి అన్నది ప్రతిమనిషిలో వుంటుంది వెంకయ్యగారూ! కాని అది శాపగ్రస్త అయిన అహల్యలా జడంగా వుంటుంది. అహల్యను ఆ శ్రీరామచంద్రుడి పాదంవలె ఆ మంచిని తటాలున ఏదో ఒకటి మేల్కొలుపుతుంది."

"అయినా ఈ గ్రామంలోనే కాదు, చుట్టుప్రక్కల కూడా కలవారు ఎంతమంది లేరు? మరి వారందరూ—" వెంకయ్యగారి



మాటలకు అడ్డొచ్చింది రుక్మిణమ్మ.

"ష్! ఎవరి అభిప్రాయాలు వారివి. మనం ఎవరినీ ఏమీ అనరాదు. నేను ఖర్చు పెడుతున్నది మాత్రం నా డబ్బా? అంతా ఆ మహానుభావుడిది. ఆ పుష్పంతో గల పరిచయమే ఈ దారానికి మిగిలిన పరిమళం"

తల వూచాడు వెంకయ్య. రెండు నిముషాలు రుక్మిణమ్మ తన కుడిచేతి మీద ఎర్రరాళ్ల గాజును చూస్తూ కూచుంది. ఉన్నట్లుండి వెంకయ్య అన్నాడు "అమ్మా. అదేదో పత్రిక నుండి ఒకాయన వస్తానని రాశాడు. మిమ్మల్ని కలుసుకోవాలట ఫోటో తీయాలట."

"అబ్బెబ్బె... అదెందుకూ? వాళ్లని ఆస్పత్రి తెరిచే రోజన రమ్మనండి. మన డాక్టరు బాబుని కలుసుకోమనండి"

"కాదమ్మా..మిమ్మల్ని."

"వద్దు వెంకయ్యగారూ, వద్దు."

త్రివేణి సంగమం వద్ద సరస్వతిలా ఆమె కమ్మటి స్వరంలో అంతర్వాహినిగా ధ్వనిస్తున్నదే— అదేమిటి అని నిముషంలో సూరో వంతు కాలం అనుకుని వెంటనే మరిచిపోయాడు వెంకయ్య.

"మరి వస్తానమ్మా! దివ్యె పోస్టాఫీసులో పనుంది."

"బండి కట్టించుకు వెళ్లండి" అంది రుక్మిణమ్మ. అట్లాగేనని ఆయన వెళ్లిపోయాడు.

తాను కూర్చున్న చోటికి ఎదురుగావున్న గోడ మీద వున్న పెద్ద ఫోటో పైవున్నాయి ఆమె కళ్లు.

ఫోటోలో ఆయన తన వేలుపు. ఆయన తన వెలుగు.

ఆయన చూపు తన మీద పడకపోతే తానింకా ఆ బురదలోనే కూరుకుపోయుండేది. కాని ఏ జన్మలో చేసిన పుణ్యమో ఆయనగా వచ్చారు. తన జీవితాని కొక బాట వేశారు. లేకపోతే ఆ రంగులు—ఆరోగాలు— ఆ రూపాయలు— ఆ బేరాలు, అబ్బబ్బ ఒళ్లు జలదరిస్తుంది. ఒకనాడు తమ కులంవారు దేవుడి సొమ్ము. వారికా నాడు మనసులే కాని శరీరాలుండేవి కావు. ఆ మనసులూ భగవదర్పితాలు.. కాని నేడో—మనసులు అసలు లేవు. మిగిలిన ఈ శరీరాలు బజారులో బేరాలు...

ఆయన నారాయణయ్యగారు తన్ను ఆదరించారు. వేరదీశారు. పుట్టుకనుండీ తన్ను దహిస్తున్న దావానలానికి అడ్డంగా చల్లటి అనిలమై నిలిచారు. తాను వద్దన్న కొద్దీ ఆయన భార్య సావిత్రమ్మ వుండగానే తన్ని ఇంటికి తీసుకొచ్చారు. అసలికే సావిత్రమ్మ క్షయ బాగా ముదిరింది. ఆయన చేతనయిందల్లా చేశారు. తనామెను చూడలేకపోయేది.. చివరకు, కన్నులు శాశ్వతంగా మూసే ముందామె మొదటిసారిగా తన్ను పిలిపించింది. పడక మీద కూచో పెట్టుకుని "రుక్మిణీ! ఆయన్ను చూసుకో" అంది.

అట్లాగే చేసింది తాను పదిహేడేళ్లు పాటు. యాభై యేళ్లయినా నిండకనే ఆయన వెళ్లిపోయారు.. తను చేసిన పుణ్యం అంతే కాబోలు.. ఇరవయ్యవయేడు దాక తను బ్రతికిన బ్రతుకులోని కుళ్లుని, దుర్గంధాన్ని జీవితాంతం ఆయనకు చాకిరి చేసి కడిగేసుకుందామని తన అంతరంగం మీది పచ్చి పుండ్లకు మందురాసి బాగు చేసి ఆచోట మంచితనానికి మల్లెలపందిరి వేద్దామని చేస్తున్న యత్నం సగంలోనే వచ్చిపోయింది.. పాతాళం నుండి తన్ను భూలోకానికి తెచ్చిన వారు తానింకా నిలబడక ముందే తప్పుకున్నారు.. అక్కడ నుండీ ఈ అన్వేషణ! తనలో లేని దానిని తెచ్చి నిలుపుకోవాలని ఈ ప్రయత్నం. ఈ ఆస్పత్రి అయినా ఆ ప్రయత్నంలో ఒక భాగమే. ఎవరికీ అర్థంకానిది, చెబితే నమ్మరు కూడా...



నారాయణ తన్ను తెచ్చినవాడు ఆయనను ఆడిపోశారు. సావిత్రమ్మ మరణించినపుడు తానే విషంపెట్టి చంపేసన్నారు. తన అనుబంధాలను ఎవరూ తెలుసుకోలేరు.. సంబంధాలు అర్థం కాకపోవచ్చు. అనుబంధాల లోతు అందకపోవచ్చు.. ఒక మనిషి లోని మంచి మరొక మనసులోని మంచిని ఎందుకు గ్రహించదు? ఒక పువ్వు నుండి గాలి తెచ్చిన గంధం మరొక్క పువ్వు తెలుసుకోలేదా? ఎందుకని—?

తమస్సు నుండి ఉషస్సులోకి అడుగు పెడుతున్న తనకు నారాయణ పోయాక దినకరుడై కనిపించినవారు హరిహర శాస్త్రిగారు.. ఆయన గురించి ఆలోచించినపుడెల్లా ఈ బాధే సరికొత్తగా పుట్టి పెరుగుతుంది...

తాను పుట్టిన చోట తాను పుట్టినందుకు తను బాధ్యురాలు కాదు. అయినా తనకు తెలియని వ్యధ తనలో రగులుతున్నది. తనొక్క గులకరాయి. శాస్త్రి గారొక మహామేరువు. తనొక గడ్డి పరక. శాస్త్రిగారొక మహావృక్షం. బురదలోని వానపాము తాను. వినువీధుల విహరించే వైనతేయుడాయన. తనలో లేనిది, తనకు కావలసినది, తాను కావాలనుకున్నది ఏదో, ఏమిటో, గొప్పది, ఎత్తైనది, ఎన్నడూ చావనిది, ఎన్నడయినా తనకు అందుతుందా అనిపించేది—ఆయనలో కాదు—ఆయన జీవితంలో వున్నది.

భగవాన్— ఈ ఆవేదనా కడలి కడచి తీరం చేరుతానా, లేక ఈ తరంగాలలో పడి ఈదలేక మునిగిపోతానా—

పంకంలో పుట్టినది పంకేరుహం కావాలనుకుంటున్నది. పరిశుభ్రంగా, ధవళ వస్త్రంగా ఆ పరమాత్ముని పాదాల వద్ద పద్మమై రాలిపోతే చాలు ఇంకేమీ వద్దనుకుంటున్నది.

ఈ 'శైల వాహిని యింకిపోకుండ
నన్ను తోర్ణవము జేరనంతియే చాలు
ఈ మల్లెల దండ యెండిపోకుండా
నన్ను తమహార్తి సహించె నంటి యోచాలు!'

ఆమె కనుకొలకుల నిలచిన నీరు వెచ్చగా ఆమె తెల్ల చీరపై పడి చల్లగా అయింది. నారాయణ ఫోటో కదిలినట్లయింది.

* * *

"నాన్నగారూ! అన్నయ్య నుండి ఉత్తరం వచ్చి రెండువారాలు దాటింది" అన్నాడు మురళి. వాడి తత్తరపాటు చూసి శాస్త్రి గారికి నవ్వు వచ్చింది. ఆయన నవ్వనా లేదు, వాలుక కదవనూలేదు.

ఈ విషయం మీద కాసేపు మాట్లాడి ఇంకో ఊసెత్తాడు మురళి. "పెద్ద నాన్నగారబ్బాయి వీరభద్రం—మన పొలం విషయమై కోర్టు కెక్కుతానన్నారట. నిన్న సంతలో వాళ్ళ పాలేరు చెప్పాడట మన రామిగాడితో—"

ఈ సారి కూడా హరిహరశాస్త్రి ముఖం మారలేదు. తలెత్తి కొడుకు నొక నిముషం చూసి ఊర్కున్నారు.

వీధిలో ఎద్దుల మువ్వల చప్పుడయింది.

"రమణాపురం నుండి విశ్వనాథయ్య వచ్చినట్లున్నాడు—" అన్నారు శాస్త్రిగారు కూచున్న చోట నుండి కదలకుండానే.

మురళి లేచి వీధిలోకి వెళ్ళాడు.

"నమస్కారమండీ ! నాన్నగారున్నారా ?" అంటూ రెండెడ్లబండినుండి చెవిపోగుల కమలాలు తళుక్కుమంటుండగా దిగాడు విశ్వనాథయ్య. అతడికి కాళ్ళకు నీళ్ళిచ్చి లోపలకు తీసుకువెళ్ళాడు మురళి. శాస్త్రి గారికి నమస్కరించి దూరంగా కూర్చున్నాడు విశ్వనాథయ్య.

ఒకప్రక్క నిలబడిన మురళిని చూసి "మజ్జిగ తెమ్మని అమ్మమ్మకు చెప్పి నువ్వెళ్ళు" అన్నారు శాస్త్రి. తనకు పరిచయం కాని శ్రుతి నాన్నస్వరంలో వినిపించింది మురళికి. అమ్మమ్మతో విశ్వనాథయ్యకు మజ్జిగ ఇమ్మని చెప్పి వీధిలోకి నడిచాడు.

నడిచి నడిచి వూరి బయట చెట్ల గట్టు దగ్గర చింతతోపులో కెళ్ళి కూర్చున్నాడు మురళి. ఆ తోపులోని చెట్ల ఆకుల గలగలల వలె అతడి మనసూ కలవరపాటు చెందింది.

వారానికి రెండుత్తరాలు రాసే అన్నయ్య రెండు వారాల నుండి ఉత్తరమైనా రాయక పోతే ఏమయ్యాడనుకోవాలి? ఉన్న రెండె రాల భూమి పోతే, తిండి ఎట్లా సాగ తుంది? అసలు కోర్టుల వెంబడి తిర గానికి డబ్బూ ఓపికా ఎక్కడి నుం వస్తాయి? ఇవన్నీ నాన్నగారికి తెలియవా?. ఛీ.. తనదెంత చిన్నతనం అనుకున్నాడ మురళి.

అచంచలమైన ఆయన విశ్వాసాని కష్టాలన్నవి లేవు కాబోలు. అందుకనే ఆయ అలా వుండగలరు. అమ్మ కన్ను మూసి రోజున తనూ అన్నయ్యా రోదిస్తుంటే తమ్ము లాలించి తానోకించుకయినా తొణక ధీరుడాయన... ముద్దనూరు జమీందార వద్ద దివాన్ గిరిని, ఆ జమీందారు తగ పని ఒకటి చేశాడని వదిలేసిన మని ఆయన.. పెదనాన్న గారేదో మాట అన్నార యాభైవేల రూపాయల ఆస్తిని నిశ్చింత వదిలేసి ఈ రెండెకరాల మడి దున కుంటూ, కృష్ణా, భగవానుడే ఊపిరి బ్రతుకుతున్న యోగి ఆయన. అట్లాం ఆయనను కొలవడానికి తానెంతటివాడు ఆయన వుండగా తానెందుకంత కలవ చెందాలి?

అన్నయ్య వుత్తరం రాయకపోతే తా వాడికి రాయవచ్చుగా.. ఇవాళ మధ్యాహ్న దివ్వెకు వెళ్ళితే..

అబ్బే ఇవ్వాళ కుదరదు రేపే వెళ్ళా ఇవాళ సాయంకాలం ఆస్పత్రి తెరుస్తార ఊరంతా హడావిడిగా వుంది. ముంద ఎవరయితే పందు కోసం వెడితే వారే ప్రా భోత్సవం చేసినట్లుట! ఆ అదృష ఏ రోగిని వరిస్తుందో

నవ్వొచ్చింది మురళికి. ఆ నవ్వు సగం ఆగింది. పాపం ఆ రుక్మిణమ్మగారు, గారిని ఆస్పత్రికి వచ్చి అందరినీ ఆ దించి వెళ్ళమని వెంకయ్య గారిని పంపి కాని నాన్నగారి కెందుకో ఈ ఆస విషయం అయిష్టంగా వున్నట్లు ఎందుకో మరి?

మురళి లేచి వెళ్ళి చెరువుల స్నా చేశాడు. హాయిగా చల్లగా వున్నాయి నీ స్నానం ముగించి, చెరువు గట్టు నిల్చుని వుండగా ఎద్దు మువ్వల చప్ప వినిపించింది. పని అయినట్లుంది థయ్య వెళ్తున్నాడు.

విశ్వనాథయ్య వెళ్ళిపోయాక నిముషం కండ్లు మూసుకు కూర్చు హరిహరశాస్త్రి.

విశ్వనాథయ్య వచ్చాడు. వెళ్ళాడు.



దుకు అని అనుకుని వుంటాడు మురళి. పై పెచ్చు, వాడిని తను వెళ్లిపొమ్మన్నాడు కూడాను. వాడికిదేమీ అర్థమయి వుండదు. ఏమిటాయన అనుకుని వుంటాడు.

ఇట్లాగే అనుకునేది లక్ష్మి కూడా. పైకి అనేది కూడా. "నాకేమీ బొత్తిగా బోధపడ్డం లేదు".. ఒక్కసారి మాట తప్పిన తన స్వంత అన్నగారి మొహం ఇహ చూడ కూడదనిపించింది. అట్లాగే చూడలేదు. ఈ విషయం లక్ష్మికి ఎన్నడూ అవగతమవ లేదు. హృదయం లేని మనిషనుకున్న దేమో.. ఆరు నూరయినా అసత్య మాడిన వాడిని, నీతి తప్పినవాడిని వాడు, అన్నేకాదు స్వంత తండ్రే అయినా తాము గౌరవించ లేదు. ప్రాణమయినా పోవచ్చును గాని మనిషి మనోవాక్కర్మలా శీలాన్ని, ధర్మాన్ని విడువరాదు. ఆ చెక్కుచెదరని నిలకడ, ఆ నడవడి, ఆ నియమము ఇదే మానవ జన్మకు అర్థం. అది లేనినాడు మనిషి మనిషి కాడు. ధర్మబద్ధమైన జీవితమే దైవ స్వరూపం.

అందుకనే తాను ఆ ఆసుపత్రికి వెళ్ల లేదు. దానికి ప్రాణం పోసిన మనిషిని చూడలేదు. మంచిపనే కావచ్చు కాని చెడు మార్గాల ద్వారా సాధించిన దానిని తాను హర్షించలేదు. వివాహమన్న పవిత్ర బంధాన్ని తృణీకరించి, అగ్నిసాక్షిగా వివాహ మాడిన ధర్మపత్నిని కాదని, అస్త్రీవయసన్నా చెప్పిన మాటలు విని ఎగబడిన మనిషి మనిషా...ఛీ..

"వంట అయింది" అన్న అత్తగారి గొంతు వినబడింది

"మురళిని రానివ్వండి" అన్నారు శాస్త్రి.

* * *

ఏదో ఆలయ మంటపమది.

స్తంభాల మీది శిల్పాలు తలలూపుతూ న్నట్లున్నాయి. ప్రేక్షకులు కనబడడం లేదు. వారి కళ్లే కనుపిస్తున్నాయి.

మెరుపులా మిన్నాగులా, మొగలి వాసనలో గాన మాధురి పరుగులిడుతూంది. ఇంత సంరంభానికీ కేంద్రమై తాను నాట్య మాడుతున్నది. పరమశివుడూ, పార్వతీ గోపికలూ, గోపాలుడూ అన్నీ తానే అయి, ఆడుతున్నది. ఆ ఆటతో జగమంతా ఆడుతున్నది."

ఆ క్షణం..సంపూర్ణమయిన క్షణం.. ముందు వెనుకలు లేని, ఇంద్రియాలకు తెలియని, అపూర్వమయిన, అనిర్వచనీయమైన ఆనందం ఆక్షణం. చావుబ్రతుకు

## రాధకథా? రామకథా?

లొక్కటయి, చీకటి వెలుగులో లీనమయి మనిషే దేవుడయిన క్షణం.

ఆ ఆనందంలో ఆ ఔన్నత్యంలో 'సా విరహేతవదీనా రాధా' అని తాను రాధయ్యై అభినయిస్తుంటే శిల్పాలు కళ్లు తుడుచుకోసాగాయి... దివ్యమయిన దీప్తి నిండిన ఆ రెండు కళ్లూ.. అవి మాత్రం ఎందుకో మళ్లీ మళ్లీ తనకు కనబడినాయి. అన్ని వేల కళ్లలోనూ ఆ కళ్లను వెతికి అవి కనపడగానే అక్కడి నూర్యులను చూడలేక ఇటు తిరుగుతున్నాయి తన కళ్లు.

ఏదో అయింది.

కళ్లు తెరిచేసరికి తాను క్రిందపడివున్నది. ఆలయమంటపం వున్నది. కాని అశేష ప్రజానీకంలో ఒక్కరూ లేరు. ఆడి అలసి నప్పటి చెమట తడి ఇంకా ఆరలేదు. కాలి గజ్జె లింకా విప్పనేలేదు. అందరూ ఏమయి నట్లు—?

ఎవరిది—ఆ స్తంభం ప్రక్కగా అటు మొహంపెట్టి రాజసంగా వెళ్లుతున్నదెవరు?

ఆజానుబాహుడు, అమరుడు ఎవరు?

"స్వామీ!" అని పిలిచింది తన యావజ్జీవితమూ ఆ పిలుపులో నిలిపి, ఇటు చూడ లేదు. ఇంకొక్కసారి పిలిచింది. ఆ కళ్లు ఇటు తిరిగాయి. ఆశ్చర్యం!

ఆజానుబాహుడు అరవింద దళాయతాక్షుడూ, నిశాచర వినాశకుడూ, పితృవాక్య పాలకుడూ, అనవరత ధర్మపరాయణుడూ అయిన దాశరథి.. చూడ పదివేల కన్నులు చాలని ఆ మంగళ విగ్రహుడు శ్రీరామచంద్రుడు.

తనేదో అందామనుకుంది... అయ్యో! మరుక్షణం ఏమీలేదు!! కనుల ఎదుటకొచ్చిన ఈ కోదండరాముని తనివితీరా చూడలేక పోయింది. తానెంత దురదృష్టవంతురాలు..




పక్కనున్న రాతిస్తంభానికి తలనుపెట్టి బాదుకుంది.

"అబ్బా" అని నుదురు పట్టుకుని లేచి కూచుంది రుక్మిణమ్మ. ఇంత మధ్యాహ్నం వేళ ఈ నిద్ర ఏమిటి, ఈ కల ఏమిటి.... కన్నులు మూసుకొని కలనొక్కసారి తలచుకోగానే తనువొక నందనవనమై పులకరించింది.

కాని ఒక నిజం విషాదకరమైన నిజం తటిల్లతలా తాకిందామెను. ఆమె నవ్వుకుంది.

'సా విరహే తవదీనా రాధా' అని అలమటించే ఆ రాధ హృదయం ఆ నల్లనివాడొక్కడికే తెలుస్తుంది. అన్నాళ్లు తనకు దూరంగా వుండిన సీతను రావణుడి చెర నుండి విడిపించినాక నిప్పులో దూకమన్న వాడికి, ఎవడో ఏదో అన్నాడని నిండు చూలాలిని నట్టడవిలో వదలమన్న వాడికి ఆ శ్రీరాముడికి రాధ ఎట్లా తెలియగలదు? నిజమే.. రాధతో రాముడు పలకడు. నిజమే.. రాముడూ రాధా సమకాలికులవడమంత విషాదం ఇంకేదీ వుండబోదు!

ఫక్కున నవ్వేసింది రుక్మిణమ్మ.. ఏమిటి తన పిచ్చి..!

"అమ్మా! వెంకయ్యగా రొచ్చారు.."

"హాల్లో కూచోమను ఒక్కనిముషం.."

మొహం కడుక్కుని హాల్లోకి వెళ్లింది రుక్మిణమ్మ. నమస్కారాలయ్యాక వెంకయ్యగారు "అమ్మా! దేవుడి దయవల్ల ఈ ఆరు నెలల నుండీ ఆస్పత్రి బాగా నడుస్తూంది. అవతల వూళ్లవాళ్లు కూడా వచ్చిపోతున్నా రమ్మా..."

తల ఆడించింది రుక్మిణమ్మ.

"డాక్టరు బాబు కూడా చాల మంచి వాడమ్మా.. మంచి చేయివాసి వున్న మనిషి. వయసులో చిన్న అయినా ఎంత నిదానం!"

"అంతా మీ ప్రయత్నం వెంకయ్య గారూ!"

"నాదేమిటితల్లీ—ఇది మీరు పెట్టిన భిక్ష."

"అట్లా అనకండి.. తప్పు..."

"ఇంకొక గొడవ వచ్చి పడిందమ్మా.. రమణాపురంలో, వీరాంలో కలరా పోకిందట" ఉలిక్కిపడింది రమణమ్మ.

"డాక్టరు బాబుతో మాట్లాడండమ్మా ఏమన్నా మందులూ అవీ కావాలేమో"

"అట్లాగే!"

ఆది నిముషాల పేపు మాట్లాడి వెం

కయ్య వెళ్ళిపోయాడు.

పదిరోజుల తర్వాత ఆ హాల్లోనే కండ్లు మూసుకుని కూర్చుని వున్నది రుక్మిణమ్మ.

ఇంతకన్న దురవస్థ ఏమున్నది.. ఆ కొంపలు ముంచే రోగం ఈ వూళ్ళోకీ వచ్చింది.

తిండీ తిప్పలూ లేక అహోరాత్రాలూ పోరాడుతున్నారు ఆ డాక్టరూ నర్సులూ.. చుట్టుపక్కల గ్రామాలన్నిటికీ ఇదే ఆసుపత్రి అయింది. ఈ రెండువారాలలో ఎంతమంది—ఎంతమంది—అబ్బా.. తలచుకుంటే ఒళ్ళు కంపరమెత్తుతుంది.

తాను ఏదో కొంత చేద్దామని వెళ్తే ఆ డాక్టరూ, వెంకయ్యా తన్నేమీ చెయ్యనివ్వడంలేదు.

ఇవన్నీ చాలవన్నట్లు నిన్న సాయంత్రం నుండి శాస్త్రిగారికి కలరా సోకిందట!

"చచ్చినా చస్తాగాని ఈ ఆస్పత్రికి మాత్రం రాను పొమ్మ"న్నారట ఆయన. వాళ్ళ చిన్నబ్బాయి చెప్పాడని వెంకయ్య అన్నారు.

ఆయన.. ఆ మహోన్నత శిఖరం.. తన జీవితానికి ఆదర్శం శాస్త్రిగారు ఏమీ కాకూడదు.. ఆయన ఏమీ కాకూడదు.

పోనీ ఆ డాక్టరుని వాళ్ళింటికే వెళ్ళి మందిమ్మని తను కోరింది. ఆ డాక్టరు కాదు కదా ఆటు వేపు నుండి గాలి కూడా అటు రానక్కర్లేదన్నారట ఆయన.

అబ్బా! ఆ వజ్ర సంకల్పంతో అల్ప ప్రాణులు తానెట్లా తలపడగలదు! తానేమి పాపం చేసింది.. తన జన్మకు తన వృత్తికి తను బాధ్యురాలా?

నారాయణను నమ్మి ఆయనకు సేదగా నిలవ యత్నించింది తను. మొదటి ఇరవై యేళ్ళ జీవితంలో గూడు కట్టుకున్న పాపానికి ప్రక్షాళనం చేయాలనుకుంది. ఈ ఇంట అడుగుపెట్టిన నాటినుండి తన బ్రతుకంతా ఆ ప్రయత్నమే. అయినా పలక మీది అక్షరాలు కావు గదపూర్తిగా చెరిపివేయడానికి... భగవాన్! ధర్మానికి ప్రతిరూపంగా వంద జన్మలకయినా నేను నడిచి చేరవలసిన గమ్యంగా ఆయనను ఎన్నుకున్నాను. ఆ మహాతపస్వి పాదధూళి శిరసున దాల్చిన చాలుననుకున్నాను. ఆయన ఎదుట పడి ఎరగను. మాటాడి ఎరగను. అయినా ఆయన నాదైవం. ఆయన నా సత్యం. ఆయన నా దీపం...

ఆ దీపమీనాడు పెనుగాలికి రెపరెపలాడుతుంటే ఎట్లా భరించను.. ఎట్లా భరించను?

రుక్మిణమ్మ చెంపలపై కన్నీరు కాలువలుగా పారుతూంది...

...కన్నీరు కాలువలుగా పారుతూంది మురళి చెంపలపై.

రవితేజ విరాజితుడు మేరునగధీరుడు. మహానుభావుడు బ్రహ్మర్షి అయిన తన తండ్రి నీరసించి, అలసిపోయి, ముడుచుకుపోయి పడక మీద పడుకుని వున్నాడు.

ఆయన గొంతు బలహీనమయింది. అయినా ఆ కళ్ళల్లో వెలుగు!!

హరిహరశాస్త్రిగారి పెదవులు కదలినట్లనిపిస్తే కండ్లు తుడుచుకుని, ఆయన నోటి దగ్గరగా వంగి వినబోయాడు మురళి.

కళ్ళతో వద్దన్నారు ఆయన.

మురళి చెవులు నెమ్మదిగా పోల్చసాగాయి "కృష్ణకర్ణామృతం'లోని ఆ శ్లోకాన్ని.

వ్యత్యస్తపాద మవతంసిత బర్హిబర్హా
సాచీకృతానని నివేశిత వేణురన్ధ్రమ్
తేజః పరం పరమ కారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణ సమయే మమసన్నిధత్తామ్

ప్రాణప్రయాణ సమయే!.. అన్న పంక్తి ప్రళయమై గర్జించింది. మురళి చెవులలో.

కట్టలు తెంచుకు పొంగిన దుఃఖాన్ని భరించలేక మురళి బావురుమని ఏడుస్తూ వీధిలోకి పరుగెత్తాడు. అపుడే ఊరి నుండి వస్తున్న వేణు చేతుల్లోకి వాలిపోయాడు.

మరురోజు ఉదయం సూర్యుడు ఉదయించలేదు. బాగా మబ్బు పట్టి వుంది.

పడక గదిలో ఒక పెట్టె ముందర కూర్చుని వుంది రుక్మిణమ్మ. ఆ పెట్టెలోని కాగితాలన్నిటిని పక్కకుంచి రెండు కాగితాలను తీసింది. ఆ రెండింటిలో ఒక దానిని తదేకంగా చూచింది.

అసలే గొలుసు అక్షరాలు ఇప్పుడింకా గజిబిజిగా వున్నాయి.

అది తన ఇంటిని రమణాపురం విశ్వనాథయ్యకు తాకట్టు పెట్టి రెండువేల రూపాయలు పుచ్చుకున్నట్లు హరిహర శాస్త్రిగారు రాసిచ్చిన పత్రం.

ఆ పత్రం మీద వేడి కన్నీటి బొట్లు రాలింది.

ఆ తడిని తన చీరకొంగుతో ఒత్తింది ఆమె.

ఆస్పత్రి తెరచిన రోజు సాయంత్రమే విశ్వనాథయ్య వచ్చి దీనిని, శాస్త్రిగారి ఇంటి పట్టానూ తన దగ్గర వుంచి రెండు వేలూ పట్టుకెళ్ళాడు.

రుక్మిణమ్మ ఆ పట్టాను పెట్టెలో పెట్టి తాళం వేసింది. పత్రం తీసుకుని పూజ గదిలోకి వెళ్ళింది. దానిని పదేపదే చూచింది చాలసేపు చూచింది. కళ్ళకద్దుకుంది. దేవుడి దగ్గరి ప్రమిదకు దానిని అర్పించింది. ధగధగమని మండిందా కాగితం. బూడిదగా రాలింది.

రుక్మిణమ్మ పడకగదిలోకి వచ్చికూచుంది.

వేణుని పిలిపించమని వెంకయ్యగారికి చెప్పాలి అనుకుంది. కిటికీ బయటకు చూసింది.

ఆపాటికి వాన ఆగింది.

ఆకాశం శుభ్రంగా నిర్మలంగా వుంది.

సూర్యుడు కొత్తగా వెలుగుతున్నాడు.



# బలము మరియు శక్తి కోసం!







బోర్నవిటా పోషకత్వమునకు సముచితమైనది.
కండరములు మరియు టిష్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు,
బలము మరియు శక్తి కోసం కార్బోహైడ్రేట్‌లు, ఎముకలన్నీ
దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు
అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్నవిటా
తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును.

## క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా

BENSONS/I-CF-23

దీపావళి టపాకాయలు ఎక్కడ దొరుకుతాయో, ఎలా కాల్చాలో అందరికీ తెలుసు! కొందరు వాటిని ఇళ్ళలో తయారుచేస్తూ ఉంటారు కూడా. కాని, బజార్లో దొరికే సామానే ఎక్కువ పేలుతూ ఉంటాయి. మరి ఈ టపాకాయలు అధికంగా ఎక్కడ ఉత్పత్తి చేస్తారు, ఎలా చేస్తారు?

మద్రాసు రాష్ట్రంలోని రామనాథపురం జిల్లాలో 'శివకాశి' అనే వూరు టపాకాయలకి చాలా ప్రసిద్ధి. ఈ వూళ్లో ఇదొక పెద్ద పరిశ్రమ. ఇందులో 1500 మందికి పైగా పనిచేస్తూ ఉంటారుట. 150 రకాల టపాకాయలకి పైన తయారు చేస్తారుట.

టపాకాయలు ఉండే చోట అగ్నిప్రమాదానికి అవకాశాలు అధికం! అందుకనే అధికారులు ఈ పరిశ్రమ విషయంలో అత్యంత శ్రద్ధ వహిస్తారు. 'కర్మాగారాలని' వూరికి దూరంగా ఉంచుతారు. వాటి నిర్మాణం కూడా కొన్ని నియమాలని అనుసరించి ఉంటుంది. ఇక కొన్ని టపాకాయల వివరాలు ఇస్తాను.

ప్రేలే టపాకాయలు:—వీటికి కావలసిన కాగితపు 'గొట్టాలు' ఇక్కడ తయారు కావు. బయట నుంచి వస్తాయి. పొడుగ్గా వచ్చే వాటిని చిన్న ముక్కలుగా కోసిఒక వైపు మట్టితోనూ, మరొక వైపు మందు తోనూ నింపుతారు. వత్తి తర్వాత తగిలిస్తారు. అంతా అయిన తర్వాత రంగు రంగుల 'లేబిల్స్', కావలిస్తే, అతికించి ఎండలో ఎండ బెడ్తారు. ఈ పనంతా సాధారణంగా ఆడవారు చేస్తారు.



తుపాకీబిళ్లలు యంత్రంతో కత్తిరిస్తున్న దృశ్యం.



దివ్వకాంతుల దీపావళి.

కాకరపువ్వొత్తులు:— తీగ ముక్కల్ని కొయ్య 'ఫ్రేమ్'లకి బిగించి అడ్డంగా 'మందు'లో ముంచి, తర్వాత ఎండబెడ్తారు. మందు కలపడంలోనే కిటుకంతా ఉంది. మరీ పల్చగా ఉండరాదు, మరీ జిగటగానూ ఉండరాదు. ఎండిన తర్వాత పెట్టెల్లో 'పాక్' చేస్తారు. మతాబాల తయారీ కూడా ఇంచుమించు ఇలాగే ఉంటుంది.

తుపాకీబిళ్లలు:— వీటిని చెయ్యటం కొంచెం కష్టమయిన పనే! అందుకని, వీటి 'ఫాక్టరీ'లు వేరే ఉంటాయి. వాటికి బయట కూడా ప్రమాదం సూచించే ఎర్రరంగు పూస్తారు. మందుని కొయ్య కర్రలతో రుబ్బుతారు. ఎర్ర కాగితానికి మందుని అచ్చుయంత్రాల ద్వారా చుక్కలు, చుక్కలుగా అతికిస్తారు. ఈ చుక్కలు ఎండిన తర్వాత వాటిమీద మరొక ఎర్ర కాగితం అతికిస్తారు. అప్పైన మందు చుక్కలు ఉన్న చోట్లని మరొక అచ్చు యంత్రం సహాయంతో గుండ్రటి బిళ్లలుగా కత్తిస్తారు. ప్రమాదం ఏదీ జరగకుండా ఉండటానికని ఈ యంత్రానికి దూది 'దిళ్లు' ఏర్పాటు చేస్తారు! కత్తించిన బిళ్లలని ఒక్కొక్కటిగా పరిశీలించి, చెడిపోయినవాటిని నీటిలో పడేస్తారు.

విష్ణుచక్రాలు:— పొడగాటి మందు గొట్టాన్ని జాగ్రత్తగా చుట్టి ఎండబెడ్తారు.

వత్తి:— ఇది చాలా ముఖ్యమయినదని, వేరే చెప్పటం అనవసరం! వీటి ద్రావకం అల్యూమినియం పళ్లేలలో ఉంచుతారు. దారపు ముక్కల్ని వీటిలో ముంచి ఎండబెడ్తారు. తర్వాత కావలసిన పొడుగుకి కత్తిస్తారు. ఈ ముక్కల మీద సన్నటి కాగితం అంటిస్తారు.

వీటన్నిటికీ కావలసిన మందు సామగ్రి దూరంగా, సురక్షితంగా ఉంచి అవసరమయిన మొత్తాలనే ఎప్పటికప్పుడు తీసుకు వస్తారు.

ఫొటోలు, వ్యాసం :
ఎన్. రామకృష్ణ ●



కాకరపువ్వొత్తుల తయారీలో తీగముక్కల్ని మందులో ముంచుతున్న దృశ్యం.



ప్యాకింగ్, రవాణా.

## కామరాజ్

(15-వ పేజీ తరువాయి)

ఇక్కడ వదలి వెళ్ళుతారు. మునిసిపల్ కార్పొరేషన్ రాబడితో ఇలాటి పసిపిల్లల విడుదులు 91, నర్సరీ పాఠశాలలు 251 నిర్వహించబడుతున్నాయి.

అక్కడి పిల్లలు కామరాజ్‌కు స్వాగతం చెప్పి, పాటలు పాడారు, నృత్యం చేశారు. పూలగుచ్ఛాలు సమర్పించారు. పిల్లలకోసం ఏర్పాటు చేసిన వసతులన్నిటినీ అడిగి తెలుసుకున్న కామరాజ్, ఆఖరుకు ఆ పిల్లలతో చేతులు కలిపి ఒక చుట్టు నృత్యం చేశారు. ఆ నృత్యంలో పిల్లలకన్నా ఎక్కువ ఉత్సాహంగా వున్న వారు కామరాజే.

"మీరు ఏమైనా మాట్లాడాలి." అని ఆ నర్సరీ నిర్వాహకులు అడిగినప్పుడు "పిల్లలే ప్రపంచ సంపద. వారిని మంచి పద్ధతులలో రూపొందిస్తే, దేశ గౌరవం తనకుతానే వృద్ధి పొందుతుంది" అని కామరాజ్ అన్నారు. పిల్లలను ఉత్సాహంతో చూసుకుంటున్న ఉద్యోగినుల శ్రద్ధను ప్రశంసించారు.

కామరాజ్ అక్కడి నుంచి వెళ్ళిపోవడానికి రెండు మూడు సార్లు ప్రయత్నించినా, పిల్లలు మళ్ళీ మళ్ళీ తనను పరివేష్టించడం వల్ల, మరి కొంతసేపు అక్కడే గడిపి, ఆ పిల్లలను ఉత్సాహపరిచారు. ఆ నర్సరీ ప్రధానాధికారిణి పిల్లల బొమ్మను ఒక దానిని కామరాజ్‌కు ఇచ్చి "భారత్ బాలబాలికలకు ఈ పిల్లల తరపున ప్రేమపూర్వకమైన కానుక" అన్నారు.

కామరాజ్ ఆ బొమ్మను కృతజ్ఞతతో అందుకొని, విడిపోవడానికి ఇష్టం లేక పోయినా, ఆ నిజమైన పిల్లల నుంచి సెలవు పుచ్చుకుని అక్కడి నుంచి బయలు దేరారు.

(సశేషం)

—అనువాదం: తి. రా.

(ఆనందవికటన్ సౌజన్యంతో)


NEW
CINTHOL
DEODORANT
LUXURY
TOILET POWDER
WITH G-11
BY




CINTHOL

సీరియల్:

# ఆమ్రపాలి

మూలం: రామచంద్రకుమార్

అనువాదం: శ్రీకాకొళ్ళ సీతారామం

### జరిగిన కథ

మగధరాజు బింబిసారుడు ఆమ్రపాలిని చేపట్టాలనే ఉద్దేశ్యంతో వైశాలికి వస్తాడు. పాలి భవనంలో ప్రవేశించి ఆమెని ఆకర్షిస్తాడు. పాలికి బింబిసారునిపై ప్రేమ కలిగింది. మహానాముడు [illegible] పాలి [illegible] చేస్తాడు. బింబిసారుని వివాహం చేసుకున్న పాలి తన తండ్రి నిర్ణయం తెలిసి, [illegible] మహానాముని చెంతకు వస్తుంది. మహానాముడు [illegible]స్తాడు. చేరిన బింబిసారుల వివాహం [illegible]. యుద్ధానికి సన్నద్ధులైన లిచ్ఛవియుల్ని పాలి శాంతింపజేసింది. [illegible] పాలి అమె [illegible] బింబిసారుని కోరారు. బింబిసారుడు పాలి దర్శనానికి వస్తాడు. పాలి [illegible] నగరం విడిచి వెళ్ళిపోయింది. [illegible] వెర్రైన పుత్రునికోసం పాలి ఆవేదన ఎక్కువైంది. పాలి ధర్మసభకు వెళ్ళింది, స్థవిరుని [illegible] అడిగింది.

## 24

స్థవిరుడు మందహాసం చేస్తూ అన్నాడు—'శ్రమణ విమలుడు రాజగృహానికి వెళ్ళాడు దేవి..........'

'నన్ను మీరు 'దేవి' అనకండి' అని పాలి అంది. ఆమె అత్యంత నిరుత్సాహ స్వరంతో అంది—'రాజగృహాని కెందుకు, స్వామి?'

'తథాగతుని బింబిసారుని దగ్గరనుండి ఇక్కడికి తీసుకొనిరావడానికి.'

'ప్రభూ, తథాగతుడు వస్తే మంచిదే కాని, ఆయనతో పాటు అతడు కూడా వస్తాడు కదా?'

"రావచ్చు...ఒకవేళ రాకనూ పోవచ్చును." అని చిరునవ్వు ఆపి స్థవిరుడు జవాబిచ్చాడు.

'మహాత్మా, అలా అనకండి. అతడెందుకు రాడు? రాకుండా ఉండనేరడు.'

'దేవీ!'

'నన్ను మళ్ళీ 'దేవి' అన్నారా, ప్రభూ...?'

స్థవిరుని ముఖం మళ్ళీ మందహాసంతో నిండిపోయింది. తన పొరపాటు ఒప్పుకుంటున్నట్లు అతడన్నాడు—'నీకింత ఆతురత పాటెందుకు?'

'నేను, పాలిని?...ఎందుకు ఆతురనయ్యావనా?...... ప్రభూ, అతడు తథాగతుని తీసుకొని పోడానికి వెడితే, నేను అతణ్ణి తీసుకుపోడానికి వచ్చాను.

'ఎందుకోసం?'

'నేనెలా చెప్పగలను?

'సంసారములోనికి ఈడ్చుకుపోయి నీవతనికి ఏమిస్తావు?'

'అతడేన్నడూ వినని దానిని, ఎరుగని దానిని ఇస్తాను.'

'ఏమది?

'తల్లిహృదయం.'

'నీవతని తల్లివా?'

'తల్లిని కాగోరుతున్నాను...కాదు,మహాత్మా, నేను అతన్ని ఇక్కడుండనీయను. సంసారంలో వృద్ధులెందరో ఉన్నారు. దుఃఖ పీడితులైన మనుష్యులు అసంఖ్యాకంగా మీకీ జగత్తులో లభిస్తారు. వాళ్ళని శ్రమణులుగ సన్యాసులుగా చేయండి. కాని మీరు, మీ తథాగతుడు ఈ కోమల కిశోరులతో మీ బుద్ధ సంఘాన్ని ఎందుకు నింపగోరుతున్నారు? ప్రకృతి ప్రదత్తమైన సుఖం మానవ హస్తాలనుండి ఎలా లాగుకొనబడుతోంది? ఈ అందమైన యువకుల్ని వాళ్ళ తల్లిదండ్రుల ప్రేమ పూరితమైన దృష్టినుండి బలవంతముగా తీసుకొనిపోయి మీ లాగా కఠిన జీవితం చెట్లక్రింద ఉండటం, పంసుకూలచీవరం, ఉగ్రతపస్సులు ఈ రహస్యోపదేశాలు ఎందుకివ్వబడుతున్నాయి? ఇంత కఠిన జీవితం గడపాలని వాళ్ళకెందుకు బోధింప బడుతోంది?'

'ఈ 'ఎందుకు?' వారిలా అయినప్పుడు నీకర్థమవుతుంది.'

'తెలుసుకోగోరటం లేదు భగవాన్. నేనాశ్రమలబ్ధిని కోరుతున్నాను. నాపై దయచూపండి...... ఆ శ్రమణుడు ఎవరి పుత్రుడో నాకు చెప్పండి.'

'తెలుసుకొని ఏమిచేస్తావు, అమ్మాయీ?'

'మీరు సన్యాసులు, స్త్రీ కాదు. నేను మీకు బోధించలేను'.

'జల మధ్యంలో ఊదు కమలం తన మూలం ఎక్కడుందో తెలుసుకో గోరదు. దానికి నీటిమీద తనవైపువచ్చే జీవజంతువు లందే ఉపయోగం కనబడుతుంది. కమలాన్ని లాగితే మూలంతో సంకోచం. కన్పిస్తుంది.

'కవియై నాకు జవాబివ్వకండి ప్రభూ, దయాళుడవై చెప్పు.'

'నీయింటికి తిరిగిపో, తల్లీ. ఇక్కడెవరూ ఎవరి భూతకాలాన్ని గురించి ఎరగరు?' అని స్థవిరుడు శాంతంతో అన్నాడు.

జవాబు విని పాలి అకస్మాత్తుగా నిల్చుంది. ఆమె గాబరా హెచ్చింది. వృద్ధ స్థవిరుని వైపు రెప్పవాల్చకుండా చూసి ఆమె మిక్కిలి కోపంతో అంది—

'నేనింత క్రౌర్యమూ, పక్షపాతమూ బౌద్ధ భిక్షువులలోనే చూశాను. కాని, మీరు నామాటకూడ వినండి. నేటివరకు పాలి నిశ్చయాన్ని మార్చలేక పోయారు. స్థవిరా, అతన్ని దాచి మీరతన్ని మీవద్ద ఉంచుకో గలరని అనుకున్నారు. కాని మీరు పొరబడుతున్నారు......నేను అతన్ని మీదగ్గరినుండి తీసుకు పోతానని మీ బౌద్ధ భిక్షువు లందరితో చెప్తున్నాను. అతన్ని ఒక్కణ్ణే కాదు. అతనివంటి ప్రతి కిశోర శ్రమణుని, శ్రామణేరుని తీసుకుపోతాను. లిచ్ఛవీయుల సేన తెచ్చి తీసుకుపోతాను...మీరు, మీ తథాగత బుద్ధుడు ఎన్నెలా అడ్డగలరో అప్పుడు చూస్తాను.'

ఆ ఆవేశంలో పాలి పోసాగింది. కాని కొంతదూరం వెళ్ళి నిల్చిపోయింది. ఆమె తిరిగి స్థవిర మండలిని చూసింది.



ఆనందంతో ఆమె అతనివైపు చూసింది: కళ్ళ నుండి అశ్రువులు ప్రవహింపసాగాయి. మహాకప్పినోస్తవిరుడు పాలిని శాంతంతో చూస్తున్నాడు. అతడా కోపంతో కూడిన మాటల వెనక ఉన్న పాలి హృదయాన్ని కనిపెట్టాడు. అతడాశీర్వదించడానికి తన కుడి చేతి నెత్తాడు. పాలి నేలమీద కూర్చుని అక్కడి నుండే నమస్కరించింది. అగంతకులు అయిన బ్రాహ్మణులు ఈ విచిత్రమైన మిక్కిలి కుతూహలంతో చూస్తున్నారు. వారిలో ఎవడూ ఆయువకసాధువు కోసం ఉన్మత్తమైన పాలిని అర్థంచేసుకో లేక పోయారు.

పాలి నిలబడి అశ్రువులు కప్పిపుచ్చడానికి ముఖం త్రిప్పుకుంది. కళ్ళు తుడుచు కోడానికామె కొంగు లాగుతున్నప్పుడు ఒక్క సారిగా ఆమెకళ్ళు తళుక్కుమన్నాయి. సాగరాల అస్పష్ట కాంతిలో భిక్షువుల చిన్న గుంపు దూరాన్నుండి వస్తున్నట్లు కన్పిస్తోంది. పాలి వెంటనే కన్నీళ్ళు తుడుస్తూ ఆవైపు పరుగెత్తింది. కొద్ది క్షణాలలో ఆమె భిక్షువుల దగ్గరకు వెళ్ళింది. మొట్టమొదట ఆమె దృష్టి ముందున్న భిక్షువుపై బడింది. అతన్ని చూడగానే హృదయంనుండి దుఃఖపూరితమైన కేక వెలువడింది. పరుగెత్తి పాలి అతనిని బాహువులతో ఆలింగనం చేసి వేగంగా ఏడవ సాగింది. ఈ భిక్షువు ఆమెసోదరుడు ఆనందుడు. అతని వెంట అభిరాముడూ వున్నాడు.

'సోదరా, సోదరా' అని పాలి అరచింది. హృదయావేశం ఆపినా ఆగలేదు. పాలిహృదయం ఇప్పుడు దుర్బలమైనట్లూ దానిలో మునుపటి దిట్టతనం లేనట్లూ ముగ్గురూ చూశారు. ఆనందుడు గాంభీర్యంతో ఆమెతల నిమురుతూ అన్నాడు—

'అమ్మా! వీరందరిలో నీకు సోదరుడు కాని వాడెవడు? శాంతించు. నాకుకొంచెందూరంగా ఉండు..........'

కాని పాలి అతన్ని మరింత గట్టిగా పట్టుకొని అంది:—

'అతడెక్కడున్నాడు? నేనతన్ని చూశాను సోదరా, అతడే, అతడే..అతని కళ్ళు..అతని శిరోజాలు, పెదాలు, కుడిబుగ్గమీద పుట్టుమచ్చ....అన్నీ నాకు జ్ఞాపకమున్నాయి. చెప్పు అతడెక్కడున్నాడు?'

'కావచ్చు, నీవు తలచినవాడేకావచ్చు,' అని ఆనందుడు మునుపటిలాగే శాంతంతో అన్నాడు. అట్టి శాంతంతోనే పాలి మహాకప్పినోస్తవిరుని, కిశోరశ్రమణివిమలుని చూసింది. పాలి వెంటనే జవాబిచ్చింది. 'సంభవం కాదు— అతడే.'

'పేరు చెప్పవా?' అని వృద్ధ అభిరాముడన్నాడు.

'ఇప్పుడే తెలిసింది—విమలుడు'.

'అతడే....!' అని వేదాంతి అన్నాడు. పాలి ఇద్దరినీ స్థిర దృష్టితో చూస్తోంది.

'సోదరా, తాతా, అతన్ని తీసుకొని నావెంటరా. మీరందరూరండి. బుద్ధసంఘాన్నంతా తీసుకొనిరా......నీవుకోరితే విమ్న నేను సన్యాసిగానే ఉండనిస్తాను. కావలిస్తే నీకు నామహాలు అప్పగిస్తాను. నీవుకోరితే ఈ ఉద్యానంలోనో లేక నామహాలులోనో



## ఆమ్రపాలి

నీకోసం అందమైన మఠం కట్టిస్తాను' నేను అవతల వుంటాను, నీవుకోరితే నగరానికి వెలుపలే ఉంటాను... కాని మీరందరూ పొండి........ సోదరా, తాతా, అతన్ని తీసుకొని అతనితోకూడ....'

ఇలా అని దుఃఖం, ఉద్వేగం, నిరాశలతో వ్యధితమైన పాలి ఆనందుని చేతులలో పడిపోయింది.

కళ్ళు తెరవగానే తను అపురాతన ఆమ్ర వృక్షం క్రిందనే నిద్రించి ఉన్నట్లు పాలికి అవగతమైంది. ఆమెదగ్గర మహాకప్పినో, అభిరాముడు కూర్చున్నారు. అందరి ముఖాలు శాంతంతో, మృదుహాసంతో వికసితమయ్యాయి. పాలి మెల్లగా లేచి కూర్చుంది.

సోదరికి నచ్చచెప్పు కార్యం సోదరునకు విడిచిపెట్టి తక్కిన భిక్షువులు అక్కడి నుండి వెళ్ళిపోయారు. కేవలం అభిరాముడు ఆనందునితో ఉన్నాడు.

అప్పుడానందుడు ఆమెకు సంసారం లోని అసారం, మోహం, మాయలత్యాగం వీటిని గురించి ఉపదేశించాడు. క్రమంగా పాలికి తనసోదరుడు, తాత, వృద్ధవేదాంతి తనకు చాలాదూరమై పర— స్వప్రేమ రహితులై విశ్వప్రేమలో లీనమైనారని తెలిసింది. ఎవరిని చూచినా ఎవరిమాట విన్నా వారియెడల శ్రద్ధ కలుగునంతటి స్థితికి వారు వచ్చారు. సోదరుడుబుద్ధి వాదంతో పాలిమీద ప్రభావం కలిగేలా చేశాడు. ధర్మోపదేశం చేసి ఆమెనోడించాడు కాని అతడు 'తల్లిహృదయాన్ని' ఓడించలేకపోయాడు. అభిరాముడూ అంతే. జీవితంలో అనేక మహా త్యాగాలను చేసి కూడా ధైర్య స్థైర్యాలతో ఉండు పాలి, హృదయంలో క్రొత్తగా ఉత్పన్నమైన పుత్ర ప్రేమ చేత ఇంత దుర్బలమై ఉండవచ్చునని ఎవరూ ఆలోచించనైనాలేదు. పాలి తన కుమారుని తిరిగి తీసుకొనగోరుతోంది—అతడు తనదగ్గర ఉండక —తన దృష్టిఎదుట ఉన్నాసరే—దాదాపు నిర్వాణానికి చివరిదశదాకా వచ్చి సంసారంలో ఎప్పుడూ అలిప్తతో ఉండిన విమలుడు ఇప్పుడామెకు మళ్ళీ పుత్రరూపంతో ప్రాప్తించలేడని ఆనందాభిరాము లిద్దరూ కలిసి పాలికి నచ్చచెప్పలేక పోయారు. ఈ విషయం పాలికి ఎంతమాత్రం తెలియలేదు.

'హాత్, ప్రేమనూ, మమకారాన్ని కోల్పోయిన హృదయం గల పాలి తుదకు వారిద్దరి చరణాలమీద శిరం వంచి పోసాగింది— ఇద్దరి కన్నులందూ నిర్దోషమైన స్నేహముంది — ప్రేమగాని, మమతగాని లేవు.

తథాగతుడైన బుద్ధుని ఆజ్ఞానుసారం దేశ విదేశాల్లో తిరుగుతున్న భిక్షుగణం ఒక నిశ్చిత సమయం వరకు తిరిగిరారని పాలికి వెళ్ళడానికి ముందు తెలిసింది. విమల భిక్షువు కూడా రాలేకపోవచ్చును.

* * *

వైశాలిలో ఒక దుకాణం ముందు ఒక నిర్గ్రంథానుయాయి కోలాహలం చేశాడు. చాలామంది ప్రజలు అతని పిలుపు, అరపు వినడానికక్కడ గుమి గూడారు. అప్పు డతడు బిగ్గరగ నవ్వుతూ అక్కడి నుండి ముందుకు సాగాడు. నగరంలోని సందులలో అతడు తనతో ఉన్న చిన్న గుంపుతో కూడ తిరుగుతూ అరుస్తున్నాడు.

పాలి ఒక కంపిత వీణా రాగిణిలో లీనమై ఉంది. ఆకేక ఆమె ధ్యానాన్ని భంగపరచింది. నిర్గ్రంథానుయాయి తన సహచరులతో కంఠంలోని శక్తినంతా ఉపయోగించి అరుస్తున్నాడు. పాలి వీణ విడిచి గవాక్షం దగ్గరికి వచ్చి నిల్చింది. ఆమె వింది— 'వైశాలీ వాసులారా,వినండి అహింసను బోధించువాడు మీ అందరి ఆధునిక మహాత్ముడు శ్రమణుడు శాక్యముని గౌతమబుద్ధునిదగ్గర, సింహలిచ్ఛవీయునిదగ్గర ఒక నిర్దోషియైన ప్రాణిని చంపించి మాంస భక్షణం చేస్తున్నాడు. రండి అహింసకు విరోధిని ప్రత్యక్షంగ చూడండి. నిర్దోషులైన ప్రాణులను చంపించి తియ్యని రుచిగల పొగపు సరకులువేసి అతడు తనశిష్యులతో పాటెంతో ఆనందంతో దాని నారగిస్తున్నాడు. రండి లిచ్ఛవీయులారా, సింహాన్ని అక్కడికి వచ్చి చూడండి.'

'సునేత్రా,' అనిపాలి బిగ్గరగా పిలిచింది. సునేత్ర వ్యధితమైనట్లు ఆమె వెనకనే నిల్చుంది. ఆమెను చూసి పాలి మందస్వరంతో అంది—'సునేత్రా భగవానుడిక్కడికివచ్చాడా?'

'అవునమ్మా., పాటికపుత్రుడు ఏడు రోజుల క్రిందట వారికిచ్చిన ఆహ్వానాన్ని మన్నించి వారిక్కడికి వచ్చారు. నేటి మధ్యాహ్నం అయ్యాక వారు ప్రవచనం కూడా చేస్తారు.

# ఆమ్రపాలి

'కాని...కాని సునేత్రా, ఆ ఆహ్వానం ఆశ్రమణుడే స్వీకరించి ఉన్నాడుకదా, వారిక్కడికేల.....'

సునేత్ర మిక్కిలి కష్టముతో తన దుఃఖాన్ని ఆపుకొని, పాలి చేతులు ఆవేశంతో పట్టుకొని ప్రార్థించింది.

'తల్లీ, నేడు కూడ భుజిస్తావాలేదా? చెప్పు, చేస్తావా,లేదా?......చెయ్యక పోతే నేనుకూడా......'

'ఏమి టే?'

'ఈఏడురోజులలో నీవెప్పుడు భుజించావు? అమ్మా.....'పాలి నవ్వింది. సునేత్ర విలపించింది.

ఒకే విషయంతో నిష్ఠ గల సునేత్ర ముఖంమీద పాలి తన గాఢసంతాపఛాయను చూసింది. ఆమె సునేత్రకళ్ళల్లోకి చూసి గంభీరంగా అంది.—'వెంటనే వావస్త్రాలంకారాలు సిద్ధపరచు. ఈమాంస భక్షకుడు, సమ్యక్‌సంబుద్ధుడు, అర్హితుడు, విద్యా సంపన్నుడు, సుగతుడు, దేవతలకు మనుష్యులకు ప్రభువు అయిన గౌతమబుద్ధుడు ఎలా ఉన్నాడో నేను కూడా చూడాలి.'

'దేవీ, చూసి ఏం చేస్తావు?'

'చూస్తే చాలు. తల్లిని పుత్రుని నుండీ, భార్యను భర్త నుండీ, కొడుకును తండ్రి నుండీ దూరముగా ఉంచుట పుణ్యమని అనుకొను మీ ధర్మం ఏమి ధర్మమని అడుగుతాను. సంసారం అసారమని చెప్పి, సుకుమారులైన యువకులకు శిశిర, శరత్, గ్రీష్మర్తువుల భీషణ శీతోష్ణాలను బలవంతంగా సహించడం నేర్పి, ఒక గ్రామం నుండి మరొక గ్రామం వెళ్ళడానికి ఉపదేశించు ఈ ధర్మ మేమిటి? సునేత్రా, నీ యీ ధర్మ మెటువంటిదని నేనా సంసారశత్రువు నడగాలి.'

పాలి ఆవేశం అశ్రువులలో ప్రవహింప సాగింది. సునేత్ర వేగంగా వస్త్రాలంకారాలు సిద్ధం చేయ నారంభించింది. పాలి ఏడు దినాల నుండి మహాకప్పినోస్థవిరుడు, ఆనందుడు, విమలుడు — వీరి ధర్మోపదేశాలు తెలిసికొన ప్రయత్నిస్తోంది. కాని ఆమె మాత్ర హృదయపు టశాంతి ఏవిధంగానూ దూరం కాలేక పోయింది. ఆమె విషాద పూరితమైన నిరాశ పెరుగుతూనే వుంది. సునేత్ర ఆమె దుఃఖకారణం ఎరుగును,







డిస్ట్రిబ్యూటర్లు: జనరల్ మ్యూజికల్ మార్ట్, మొజంజాహి మార్కెట్ ఎదురుగా, హైదరాబాద్-1.

## ఆమ్రపాలి

ఇప్పుడామె పాలి కన్నీరు చూడలేకుండా ఉంది.

ఒక జాము తరువాత పాలి సింహాని యిల్లు చేరగానే గౌతమబుద్ధుడు దిగంబరుడైన పాటిక పుత్రుని యింటికి వెళ్ళాడని ఆమెకు తెలిసింది. పాటిక పుత్రులు, అన్య సంప్రదాయములను అనుసరించు సింహ లిచ్ఛవీయుడు అతనికి వినమ్రులైన సేవకులై అతని వెంట వెళ్ళారని విని పాలి మిక్కిలి ఆశ్చర్యపడింది. ఆమె తన రథాన్ని పాటిక పుత్రుని నివాసం వైపు పోనిచ్చింది.

అక్కడి నుండి కొంత దూరంలోనే పాలి తన రథం ఆపివేసింది. కాని, కాళ్ళు భూమి మీద పెట్టగానే గౌతమబుద్ధుని కలుసుకోవాలని కామెను ఇంతవరకు ఈడ్చుకొని వచ్చిన ఆ వేగం పూర్తిగా శాంతించింది. మెల్లగా పాలి ముఖద్వారం సమీపంలో ఎవరైనా గుర్తిస్తారను భయం చేత అందరికంటె వెనక నిల్చుంది. ఒక్క సారిగ అక్కడ నిలబడగానే విస్మయం చేత స్తబ్ధ అయింది—

అనుకంపా పూరిత మందహాసం చేత తథాగత గౌతముని ముఖం వికసితమవు తోంది. అతని శరీరం ఏదో అజ్ఞాత తేజస్సుచే దేదీప్యమానంగా ఉంది.

దిగంబర పాటిక పుత్రుడు మాటాడక అక్కడ కూర్చున్నాడు. అతని శిష్యులు, అనుయాయుల స్థిర దృష్టి గౌతమబుద్ధుని వైపునే ఉంది. పాటికపుత్రు డలాగే మౌనంగా ఉండడం చూసి తుదకు గౌతముడు నిల్చి ఆశీర్వదించి అక్కడ నుండి పోసాగాడు. పాటికపుత్రుడు నేలనంటుకొని పోయాడో అన్నట్టున్నాడు. గౌతముడు వెళ్ళిపోయాకయినా అతడు లేవలేక పోయాడు. గౌతమబుద్ధుని మాటలు అతని శరీరాన్ని, మనస్సును మిక్కిలి ప్రభావం కలదిగా చేశాయి. అతని బుద్ధి కూడ అతని అనుయాయుల లాగ, అంత మున వచ్చిన పాలిలాగ కుంఠిత మయింది.

కొండ కొనపైన నిల్చి క్రిందికి దృష్టి నిలిపినచో పొలాల విభిన్న ఆవరణాలతో భూమి కప్పబడినట్లు కన్పించినట్లే, పీలి కల్లి అంటుగట్టిన వస్త్రంచే గౌతముని శరీరం ఆచ్ఛాదితమయింది. ఆయన

# అమ్రపాలి

హస్తంలో సామాన్య భిక్షుకుని లాగే ఒక భిక్షాపాత్రవుంది. ఒక భుజానికి ఒక చిన్న జోలి వ్రేలాడుతోంది. ఆయన వెనక పట్టశిష్యులు సారిపుత్ర, మౌద్గలాయనులు ఉన్నారు. కొంచెం దూరంలో ఆనందుడు అంగరక్షకునిలా వెంట వెడుతున్నాడు. గౌతముని ప్రసన్నమైన ముఖముద్ర, మరి యితర అలౌకిక ప్రభావం వల్ల ప్రతి వ్యక్తి మంత్ర ముగ్ధునిలా ప్రభావం పొందుతున్నాడు. వారు ముందుకు సాగినకొద్దీ, వారి ప్రేరణతో పాటు విరోధులు కూడా తలవంచుకుంటున్నారు. సింహుడు ఆనందము, శ్రద్ధ — వీనిచేత పులకితుడవుతూ పాలిని కోపంగా చూసి వెళ్ళిపోయాడు. కాని పాలి దృష్టి దూరంగా పోతున్న ఆ ఉద్ధారకుని వైపు ఉంది.

పాలి బుద్ధుని చూసింది. ఆమె మనస్సు కోపం చేత ఉత్తేజితమవుతోంది. అతన్ని పిలవడాని కామె ఎన్నో మాటలాలోచించింది. కాని బుద్ధుడే అందరినీ ఆశీర్వదిస్తూ ఆమె దగ్గర నుండి వెళ్ళిపోయినప్పుడు ఆమె ఏమీ ఆలోచించక అతని ముందు శిరం వంచుకుంది. ఆమె మనసు మీద ఏదో అజ్ఞాత అంకుశపు కొన ఉంచబడింది. అది గ్రుచ్చుకొన్నా, కొంచెమైనా మాట్లాడనివ్వడం లేదు.

పాటికపుత్రుడు మౌనంగా ఉండడం వింతకాదు. సింహ లిచ్ఛవీయుడు కన్నీరు కార్చడం వింతకాదు. కాని, పాలి ఇలా వివశురాలై తల వాల్చడం అవశ్యం ఒక వింతే.

పాలి యింటికి వచ్చాక ఆమె వ్యాకులత మరింత హెచ్చింది. ఆమె ఏమి చేయడానికి వెళ్ళింది? ఏమి చేసి వచ్చింది! గౌతమ బుద్ధుని చూడగానే ఆమె ఒక్కసారిగా ఎలా శాంతించింది? అతని కొక్క మాటయినా ఎంచేత చెప్పలేక పోయింది? తథాగతుడు నిశ్చయంగా ఇంద్రజాలికుడు, మాంత్రికుడు. కాకపోతే, వందల మంది పురుషులలో ఒక్కడైనా అతనితో ఏమీ చెప్పలేదా? ఆలోచింపగా ఆమె క్రోధం మళ్ళీ ప్రజ్వరిల్లింది. అశాంతి పెరిగింది. ఆమె కోపం పాపం సునేత్ర మీద చూపింది.

(సశేషం)

# రచయితలకి ఒక మనవి

దీపావళి కథలపోటీకి చాలాకథలే వచ్చాయి. ప్రచురణకి స్వీకరింపబడని కథల రచయితలందరికీ కార్డులు పంపటం వీలు కాదు కాబట్టి పోటీలో బహుమతులు పొందకపోయినా మామూలుగా ప్రచురణకి యోగ్యమయినవిగా స్వీకరింపబడిన కథల జాబితా ఈ క్రింద వేస్తున్నాము. ఈ జాబితాలో లేని కథలన్నిటినీ—బహుమతి కథలుతప్ప—ప్రచురణకి యోగ్యం కానివిగా నిరాకరించవలసి వచ్చిందని రచయిత లందరికీ మనవి చేసుకుంటున్నాము. పోటీ నిబంధనల ప్రకారం ప్రాతప్రతి తిప్పి పంపటంగాని, ఈ విషయమయి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపటంకాని సాధ్యంకాదు. అందరికీ మాకృతజ్ఞతలు— సం.

అంతర్ముఖుడు:—సింగరాజు లింగమూర్తి.
అనుబంధం:— అత్తిలి వెంకటరత్నం.
అనుబంధం:— వి. రాజ్యలక్ష్మి.
అప్రతిష్ఠ:—బందే మల్లిఖార్జునరావు.
అమ్మ:— తాడిగిరి పోతరాజు.
అవాంఛితం:— కొలకలూరి.
ఆఖరుఘడియలు:— ఎస్.ఎస్. లాల్.
ఆరనిపగ:— విన్.ఎస్. మణ్యమ్
ఉత్తరాగీతం:— బాబాశీలం.
ఉబ్బులింగడు:—కొనకళ్ల వెంకటరత్నం.
ఏడో విక్కం:— ఎ. విశ్వేశ్వరరావు.
కన్నెమనసు:— కస్తూరి విశ్వనాథం.
కరిగినకల:— సుధాంశు.
కాలు జారింది:— అరిగే రామారావు.
కిరణ్మయి:—వేమకోటి సీతారామశాస్త్రి.
గాజుకుప్పె:— శివల జగన్నాథరావు.
గోడమీద గడియారం: —డి. వీరభద్ర రావు.
చరమగీతి:— శ్రీనాథుడు.
చలి:— శ్రీరంగం రాజేశ్వరరావు.
చావు:— శ్రీపతి.
జీవనసంధ్య:— ప్రేమ.
జీవవాహిని:— జి.వి. కృష్ణారావు.
తప్పు:— మురళీకృష్ణ.

తీరం మారింది:— సింగరాజు రామ చంద్రమూర్తి.
తెల్లగులాబి:— అప్పాజీ.
తొలిచావు:— సురమౌళి.
దృష్టిభేదం: — జొన్నలగడ్డ రాజ గోపాలరావు.
దీపం:— బి. పి. కరుణాకర్.
నరకాసురవధ:— మారుతి.
నవ్వు:— కొడవంటి కాశీపతిరావు.
నిజానిజాలు:— పి. రాజ్యలక్ష్మి.
నిప్పులాంటి నిజం:— చుక్కారెడ్డి.
నేనున్నాను:—మా హనుమంతరావు.
నైవకించిత్కరోమి:-కొంపల్లి గౌరీశంకర్.
పరంధామయ్య:— ప్రాత్రో.
పల్లెటూళ్లో బడిపంతులు:— జంధ్యాల సూర్యనారాయణశర్మ.
పువులు— పందెం— పచ్చీసు:— పోలా ప్రగడ సత్యనారాయణ మూర్తి.
బాదరాయణసమ్మంధం., వయం వయం: పంతుల విశ్వనాథరావు.
మంచు కాలింది:—పి.యస్. నారాయణ.
మనసులోని కుంచె:— శీలావీర్రాజు.
మనిషి— మనసు:— తారక
మబ్బు వీడని ఆకాశం:— తిరుపతయ్య.

మమత:— ఆర్.వి.యస్. రామస్వామి.
మానవత్వం— బిల్లు మొత్తం:— కామరాజుగడ్డ రామచంద్రరావు.
మాయమ్మ మల్లా పుట్టింది:— భూపతి రామారావు.
రెయిన్‌కోటు: — నోరి సుబ్రహ్మణ్య శాస్త్రి.
లచ్చి:— గుడిసేవ వెంకటేశ్వరరావు.
వాళ్లు ముగ్గురు:— వై. రాంబాబు, శాయి.
విచ్చిన మబ్బులు:— ఇల్లిందల సర స్వతీదేవి.
విధితెచ్చిన మార్పు:— బారు నరహరి.
వీడ్కోలు:— జి. వెంకట్రామరెడ్డి.
విపర్యయాలు:— డి. కామేశ్వరి.
సత్యనారాయణ వ్రతం:— పిల్లిర భావ నారాయణరావు .
సత్తు రూపాయి:— ఎ. విశ్వేశ్వరరావు.
సమస్య— పరిష్కారం:— ఎమ్. ఆర్. ప్రసాద్.
సముద్రం:— ఇస్మాయిల్.
సయోనారా:— బి. విజయలక్ష్మి
స్మృతిరేఖలు:— కుమారి సరస్వతీరావ్
సాలెగూడు:— కొ. సరోజిని.
'?':— శ్రీధర రాధికా కృష్ణ.

# జంషెడ్‌పూర్
# స్టీల్ నగరులు 'శ్రమవీర'
# జాతీయ బహుమతులు పొందుట



R.C. భకత్
2,000 రూపాయల ఉత్తమ
బహుమతి పొందెను.

భారత ప్రభుత్వమువారు మొట్టమొదటిసారిగా 1966 మార్చిలో మన దేశపు క్రొత్త నాయకులైన శిల్పులకు, పారిశ్రామికులకు 'శ్రమవీర' జాతీయ బహుమతుల నిచ్చుటకు నమ్మానము చేసిరి. తక్కువ ఖర్చుతో హెచ్చు ఉత్పత్తి చేయుటకు సూచన లిచ్చువారికి ఏటేటా యీ బహుమతు లివ్వబడును.

ఈ సంవత్సరపు 27 బహుమతులలో, 2 ఉత్తమ బహుమతులతో కలిపి అందు కనబడు చిత్రములందున్న వారికి ఇచ్చిన 5 బహుమతులు టాటా స్టీల్ ఉద్యోగులకు లభించినవి—ఇన్ని బహుమతులు ఏ ఇతర పారిశ్రామిక సంస్థకును లభించలేదు.



M.M. మజుందార్
2,000 రూపాయల ఉత్తమ
బహుమతి పొందెను.

గత 20 సంవత్సరములలో జంషెడ్‌పూర్ పనివాండ్రు 12,000కు పైగా సూచన లివ్వగా, వాటిలోనుండి సుమారు 1,000 సూచనలు ఆమోదింప బడినవి. ఉత్పాదన శక్తిని హెచ్చించుటకు, పనిని సురక్షితముగా చేయుటకు, దేశీయ దినుసులను, అనుభవమును, హెచ్చుగా వుపయోగించి స్వశక్తిని పెంపొందించుటకు, యీ సూచనలు తోడ్పడినవి.

సూచనలను ఆహ్వానించు సంస్థ (Suggestion Box Scheme)ను మొట్ట మొదట నెలకొల్పి పారిశ్రామికుల స్వశక్తిని పెంపొందించుటకు తోడ్పడి నందుకు టాటా స్టీల్ వారు గర్వించుచున్నారు. ఈనాడు మన దేశము నందు యీ సంస్థను ప్రతి పరిశ్రమలో ఒక నియమముగా ప్రవేశ పెట్టుచున్నారు.

## టాటా స్టీల్



K.B. దూబే
500 రూపాయల
బహుమతి పొందెను.



బలివంత్ సింగ్
500 రూపాయల
బహుమతి పొందెను.



అఫ్‌జల్ హుసేన్
500 రూపాయల
బహుమతి పొందెను.

The Tata Iron and Steel Company Limited

మెంతా చలితో, చీకటితో బాధపడుతూ గడపవలసి వుండేదేమో! అందువల్లనే కాళ రాత్రి, మహారాత్రి (దీర్ఘంగా గడపవలసిన రాత్రి) అని అని వుంటారు. ఆరునెలలలో తమకు, తమ పితాళ్ళకు వెలుగు కోసం, పద్గతుల కోసం, అంటే తమకు దారి చూపడం కోసమే కొండల పైన, గుట్టల పైన, చెట్ల మీద, నదుల గట్ల మీద దీపాలు పెట్టాలని, కొరువులు తిప్పాలని, పొలిమేరలలో దారిచూపే గడ్డిబొమ్మలు (మార్గ పాలీబొమ్మలు) కట్టాలని, యమునికి సంతోషకరంగా పూజాతర్పణాదులు చేసి, దీపదానం చేయాలని ధర్మశాస్త్ర గ్రంథాలు చెబుతున్నాయి. నరక నివారణార్థం అంటే నరకం మనకు అంటకుండా, ఉన్న పాపం కాదు—రాబోయే పాపం అంటకుండా, మంగళస్నానాలు చేయాలని కూడా ఈ గ్రంథాలు చెబుతున్నాయి. వీటిని చూడగా, మనపూర్వులు, చీకటికి, చలికి భయపడి, ఎంతగా జాగ్రత్తపడ్డారో తెలుస్తుంది.

తర్వాత ఆ నైసర్గిక పరిస్థితులు మారడమో, వారు ఇతర ప్రాంతాలకు తరలి రావడమో జరిగింది. దానివల్ల పరిస్థితి మారింది. అయినా, పాత ఘటనలవల్ల జీవితంలో భాగమైపోయిన ఆ ఆచారం అల్లాగే మిగిలి, వుత్సవంగా, దీపోత్సవంగా మిగిలిపోయి, సంప్రదాయమయింది.

నరక భయ నివారణ కోసం అనేది

# దీపావళి

(11 వ పేజీ తరువాయి)

క్రమంగా మరొక అర్థంతో కలిసి నరకాసురుడని వాడుక వచ్చింది. కామరూపదేశ రాజయిన, అనాది జాతి నాయకుడయిన నరకునితోనో, ఆజాతితోనో మనపూర్వులకు జరిగిన పోరాటంలో మనవారికే విజయం సంభవించి వుంటుంది. దానితో కామరూపు లతో మనకు పొత్తు కలిగి, పూర్వపు ఆ నరకాసుర పతనం నరకాపనోదన క్రియతో చేరి, పాత వుత్సవం మరొక రెమ్మ వేసింది.

ఇలా వుండగా రామాయణ గాథకూ దీనితో ఎవరో ముడిపెట్టారు. శ్రీరాముడు రావణ వధానంతరం అయోధ్యకు మరలి వచ్చిన తర్వాత, పాదుకా పట్టాభిషేకం చేసి ఎదురుచూస్తున్న భరతుని కలుసుకున్నది ఈవాడేనని ఎవరో జోడించారు. పాతకాలంగా వస్తున్న వుత్సవానికి రామాయణ కథను జోడించడంతో పండుగ మరికొంత విస్తృతమయింది.

శ్రీరాముడు ఆశ్వయుజ మాసంలో వానర సైన్యాన్ని కూర్చుకుని, ఫాల్గున మాసంలో అమావాస్యనాడు రావణుని సంహరించి, చైత్రశుద్ధ పాడ్యమినాడు రావణ దహన సంస్కారాలు జరిపించి, చైత్ర శుద్ధ విదియనాడు విభీషణునికి పట్టం కట్టి, తదియనాడు లంక నుంచి విమానంలో బయలుదేరి, చవితినాడు కిష్కింధ, పంచమినాడు భరద్వాజాశ్రమం చేరి, షష్ఠినాడు భరతుని చూచినట్టు, చైత్రశుద్ధ సప్తమినాడు అయోధ్యలో పట్టం కట్టుకున్నట్టు రామాయణ వ్యాఖ్యాతలు తెలుపుతున్నారు. 14 సంవత్సరాల అరణ్యవాస కాలం ముగిసిన తర్వాత పంచమినాడు శ్రీరాముడు భరద్వాజాశ్రమం చేరినట్టు, "రేపు భరతుణ్ని చూద్దురుగాని లే" అని భరద్వాజ ముని శ్రీరామునితో అన్నట్టు రామాయణం చెబుతున్నది. (యుద్ధకాండ, 124 స. వ శ్లోకం) ఇది చైత్రశుద్ధ పంచమి కాకపోయినా, ఆశ్వయుజ చతుర్దశి అమావాస్యలు మాత్రం కాదు. మరి భరత్ మిలాప్ ఆచారం ఏ ప్రబల కారణాలవల్ల దీపావళి అమావాస్య నాడని నిర్ణయమయిందో చెప్పలేము లోకం గతాను గతికం.

ఆ నైసర్గిక పరిస్థితులు, ఆ జాతుల సంఘర్షణలు అవన్నీ ఏమయితేనేం? నేడు మనకది దీపోత్సవం. దీనిని తర్వాతి వారు "దీపోత్సవం", "కౌముదీ మహోత్సవం" అన్నారు. మనకు నరకాసురవధ కన్నా అదే బాగుంది.

వెలుతురును, జ్ఞానాన్ని, ఆనందాన్ని కోరని జాతి అంటూ వుంటుందా? మన దేశంలో అనాదిగా, (పాత సంప్రదాయంతో సంబంధంలేని) దీపోత్సవంగా ఇది బౌద్ధ కాలానికి ముందు నుంచి వుంది. ఇతర దేశాలలోను దాదాపు కన్య, తులా, వృశ్చిక మాసాలలో దీపోత్సవం జరిపే సంప్రదాయం వుంది. కొన్నిజాతులకు నూతన సంవత్సరం దీపోత్సవంతో ప్రారంభమవుతుంది.

అందుకే అన్నాను, మన పండుగలు, ఆచారాలు మొదట ఏ పరిస్థితులలో, ఏకారణాలతో ఏర్పడి వుంటాయో, ఆ కారణాలు కాలక్రమాన మారి, కొత్తవి చేరి, విడమరచరాని స్వరూపం పొంది, కాలం గడవను గడవను, అవి పూర్వం ఏ కారణాలతో ఏర్పడి వుంటాయో, ఆ కారణాలు, భయాందోళనలు పోయి, తద్విరుద్ధమైన సంతోషానంద వినోదాలకు కారణాలవుతాయి—అని.

శి. రా.




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S.Sambhu Prasad.